# కనకతార

(అయిదంకముల నాటకము)

△

నిర్మాత:

శ్రీ కె. సూర్యప్రకాశరావు గారు



౧ వ. కూర్పు 1000 ప్రతులు

ప్రకాశకులు:

కాళహస్తి తమ్మారావు అండు సన్సు,

సంస్కృతాంధ్ర బుక్ డిపో :: రాజమహేంద్రవరము.



1947

మూల్యం 1 రూపాయి.

# నటనా సమ్మేళనము.

## పురుషులు.

ఉదయసేనుడు — మహారాజు
సుమంత్రుడు — ఉదయసేనుని మంత్రి
ప్రతాపుడు — సేనాధిపతి
క్రూరసేనుడు — ఉదయసేనుని సోదరుడు
సులోచనుడు — ఉదయసేన మహారాజు సేవకుడు
రామిసెట్టి — కొత్వాలు
వీరపాలుడు } క్రూరసేనుని మిత్రులు
శూరపాలుడు }
కనకసేనుడు — ఉదయసేనుని కుమారుడు
మారుడు — దొంగలనాయకుడు
పల్లివాడు — కమలను రక్షించినవాడు
విజయసింహమహారాజు — ఉదయసేనుని స్నేహితుడు
సుమంత్రి — విజయసింహుని మంత్రి
ముని — కనకసింహునికి హితోపదేశ మొనరించినవాడు
వీరసింగు — కమలను అడవిలో రక్షించినవాడు
భటుడు — విజయసింహుని ద్వారపాలకుడు
సుపన్నుడు — కనకసింహుని మంత్రి
వైద్యుడు - వీరసింగు కుమారుని బ్రతికించినవాడు
బాలుడు — వీరసింగుని కుమారుడు

## స్త్రీలు

కమల — ఉదయసేనుని భార్య
మంజువాణి — కమల చెలికత్తె
తార — ఉదయసేనుని కుమార్తె
పుల్లి — పల్లివాని భార్య
కుముదాబాయి — వీరసింగు రెండవభార్య



# కనకతార

## ప్రథమాంకము

### ప్రథమరంగము—కొలువుకూటము

[తెర యెత్తగా సింహాసనాసీనుఁడై ఉదయసేనమహారాజు,
ధీమంతుఁడు, ప్రతాపుఁడు]

ఉదయ:—సచివోత్తమా! నా మనోవ్యథయడంగు నవకాశము నాకు లభింపదు కాఁబోలు!

సీ. చతురబ్ధి పర్యంత • సామ్రాజ్యమాయుండె;
చతురంగబలమును • సంతరిల్లె;
వైరిరాజుల నాజి • భంగ మొందించెడి
చేవ కేదిధమ్మైన • చేటు లేదు;
సంక్రందనుని దివ్య • సంపద హాసియించు
భోగభాగ్యంబులు • పొలుపుమీఱు;
సంతోషమునుగూర్చు • సంతానమాకల్గె
అనుకూలవతియె య • ర్ధాంగలక్ష్మి

గీ. నాదు కనుసైగలఁ జరించు • నయవినయ వి
శారదులయిన సుగుణులు • న్నారు మీఁగు;

ఇన్నికల్గియు నక్కటా! ♦ యేదను నాకు
క్రూరసేనుని కతన వి ♦ చార మొదవే.

భీమం :—మహారాజా! మీరు సోదరుని చర్యలను గ్రహించి హృదయమునఁ బరితపించుచున్నారని నే నెరుగుదు; పలుమారు లాతని జేరదీసి దుష్ప్రవర్తనమునకు స్వస్తి చెప్పుమని చిలుకకుఁ చెప్పినట్లు చెప్పితి. కాని ప్రయోజన మావంతయు గానబడుట లేదు. నీతులు గనఁ జెవందులకు నన్నాతఁడు తన పరమశత్రువుగా భావించుచున్నాఁడు.

ఉదయ :—మంత్రిసత్తమా! నేనుమాత్రము చెడునడ్తమాను మని చెవినిల్లుగట్టుకొని పోరలేదా? పోరితిని—పోరుచుంటిని—పోరగలను కాని నీవు చెప్పినట్లు ప్రయోజనము మృగ్యమే.

గీ. ధర్మమార్గంబు దప్పక ♦ తనరుమనుచుఁ
భాపకార్యంబునను జేయ ♦ వలదటంచు
నెంతచెప్పినవానికి ♦ సుంతయైన
జ్ఞాన ముదయింపదాయెను ♦ స్వాంతమందు.

(అపుడు క్రూరసేనుఁడు ప్రవేశము)

క్రూర :—(తనలో) వృద్ధభల్లూకములు నా అన్నగారు సింహాసన మలంకరించి మర్కటస్వరూపుఁడగు మహామంత్రిగా రేదియో ముచ్చటించుచున్నారు. దున్నపోతువలెనున్నా సేనాని ప్రతాపుఁడు సాలోచనముగఁ గూర్చున్నాడు. ఇటు నే నించుక సేపాగి వీరి సంభాషణ మాలకించెదఁగాక! (చాటున నిలువఁబడియుండును)

ప్రతా :—దేవా! ఎంతతిన్నఁగఁ దీసినను కుక్కతోకకుఁగల వంకర పోదుగదా! క్రూరుడగు క్రూరునిలోఁగల దుష్టస్వభావము మాటలలో మాయమగునా?

క్రూర :—(తనలో) ఔరా! ఏమి నీ కండకావరంబు. ఈ క్రూరుని దుష్టత్వము జవిచూడఁగోరుచున్నావా?

ఉదయ :—సేనాధిపతీ! నీవు చెప్పినమాట సత్యమే! వాని చేతలు మాటలతోఁ గట్టవు. కాని యేకగర్భజనితులముగదా!

నా హృదయము కోమలముగదా! ప్రేమను బాల్యద్రోలి వానింబట్టి శిక్షించుటకు మానసమొప్పునా?

క్రూరు:—(తనలో) చేవయున్నచోఁ జిత్తమొప్పకేమి, చేతకానితనమని చెప్పికొనరాదా?

ప్రతా:—రాజశేఖరా! మీ రిట్లుపేక్ష సేయుట తగదు, ప్రజలాతని దుండగములకు సహింపలేకుండిరి.

క్రూర:—(తనలో) ఉపేక్షసేయక, ఉరిపోసికొందువా? తుచ్ఛుఁడా! ప్రేలుము ప్రేలుము.

ఉదయ:—సేనానీ ప్రజలపీడం బాపుటయే రాజధర్మము.

ప్రతా:—అవశ్య మట్లుగావింపుఁడు (కొంచెమాఁగి) మహారాజా! తలఁచుకొనిన నా కాశ్చర్యము తోఁచుచున్నది ఒకే తల్లి కడుపున వెలువడిన వానిలో నొకటి రత్నమా? వేఱొకటి గులకరాయియా? ఒకటి రాజహంసియా? వేఱొకటి గుడ్లగూబయా? ఒక వ్యక్తి గుణరత్నాకరుడైన దిగంత యశోవిశాలుఁడా? మఱియొకఁడు జారచోరదుష్కార్యతత్పరుఁడా?

క్రూర:—(తనలో) నీ కంత్యకాలము సమీపించినది. దేగ చెడిపోవుకాలమున మిడితలనుబట్టును: ఆసన్నకాలమగుటచేతనే, క్రూరసేనుని నీ విధంబుగా అనకతవకమాటలాడుచున్నావు

ధీమం:—(నవ్వుచూ) ప్రతాపా! నీకావిధాత సృష్టివైచిత్ర్యము తెలియదుకాఁబోలు! ఏకగర్భజనితులయ్యు మన మహారాజ గారు—ఉత్తములు గానేల? క్రూరసేనుఁడు క్రూరుఁడుగానేల? యని సందేహించుచున్నావు.

గీ. అమృతముదయించు చోట హా ♦ లాహలంబు
పరిమళంబిచ్చు సుమముల ♦ సరసముండ్లు
నత్తగుల్లలమధ్యను ♦ ముత్యములను
పొడముచుండుట నెరుఁగవే ♦ పుడమియందు.

క్రూర :—(తనలో) ఓ వృద్ధజంబుకమా ! ప్రతాపు నొంటరిగ యమపురంబునకుఁ బోపుచ్చుట నీకు సమ్మతము కాదుకాఁబోలుఁ ! నాకిదోడుగా వెడలవచ్చును.

ఉదయ :—ధీమంత్రి ! నీవు సార్థకనామధేయుఁడవు ; బృహస్పతిఁ బోలినవాఁడవు, ఏను సింహాసన మలంకరించినది మొదలు నేఁటివరకు నాకు సర్వవిధముల సహాయము మొనరింపుచున్నావు ఈనాఁడు నాకుఁ గల మనస్సంతాపమును గూడఁ బాపు నుపాయ మెఱింగింపుమా,

క్రూర :—(తనలో) ఉపాయమా ముదుసలి కేమి తెలియును. వృద్ధులకు బుద్ధిచాంచల్యము నిక్కము గదా! నన్నడుగుము నేను జెప్పెదను.

(అంత సేవకుఁడు సులోచనుఁడు ప్రవేశము)

సులో :—జయము జయము మహారాజుగారికి.

ధీమం :—ఓరీ ! నీవు వచ్చినకార్య మేమి ?

సులో :—ప్రభువువారిని సందర్శించుటకు రామిసెట్టి వచ్చియున్నాఁడు.

క్రూర :—(తనలో) గతరాత్రి నేను, అనుచరులగు వీరపాల శూరపాలురతోఁ గూడఁ బోయి వీనికిఁ జేసిన శాస్తిని జెప్పుకొనుటకు గాఁబోలు వచ్చినాఁడు

ఉదయ :—అమాత్యశేఖరా! రామిసెట్టియనఁగా నెవ్వాఁడు ?

ధీమం :—ఆతఁడే ; (సేవకునితో) ఓరీ ! వాని నిందుఁ బ్రవేశ పెట్టుము. (సేవకుఁడు నిష్క్రమించును)

ప్రతా :—ఈతఁడు ప్రభుసందర్శనముం గోరు టెందులకో ?

ధీమం :—ప్రతిదినము మనము చూచుట లేదా ? అనేకులు ప్రభుసందర్శనముం గోరుట క్రూరసేనుని దుండగములనుగూర్చి మొఱ పెట్టుకొనుటకే కదా!

క్రూర :—(తనలో) ఈ క్రూరసేనుని ప్రతాపము బోధపడు చున్నదా ?

(సేవకుడు రామిసెట్టి ప్రవేశ పెట్టును)

రామి:—(వెక్కి వెక్కి యేడ్చుచు) బాబు! మా రాజా! దణ్ణాలు దణ్ణాలు!

క్రూర:—(తనలో) నిన్నరాత్రి మా మంచి కొడుకును దేహ శుద్ధి చేసితిని; కాని పరలోకయాత్ర సేయునట్లు చేయలేదు

ధీరం:—సెట్టీ! ఏడ్చుచున్నావేమి? నీకు వాటిల్లిన కష్టమేమి ప్రభువువారికి మనవి చేసుకొనుము.

సెట్టి:—అయ్యో! బాబయ్యా! బాబయ్యా! నాకర్మం! నా వారెద్దం—బంగారంలాంటి కోడిపిట్టోణ్ణి—రామరాజ్యంలాంటి పభువుల పరిపాలనలోకూడా కష్టాలు మాకు తప్పలేదు.

క్రూర:—(తనలో) నీ కష్టములు గట్టెక్కుటకు ఉదయసేనుడు చాలడు; క్రూరసేనుడే సమర్థుడు.

ఉదయ:—(విచారముతో) సెట్టీ! గుండెబాదుకొని నెత్తి మొత్తుకొని విచారింతువేల? నీకు కలిగిన వెతం దెల్పుము

సెట్టి:—బాబయ్యా! మా రాజులుంగారు! ఏమని సెప్పను? ఏమని సెప్పను? నోరురాదు. ఆ కూరసేనుడు బాబూ! నోరురాదు. (ఏడ్చును)

ప్రతా:—మంత్రివర్యా! మీ యూహ సమంజసమే!

ఉదయ:—(ఆత్రముతో) ఏమి? క్రూరసేనుడా? శతస్పృష్టుండవు భీరుడవు నగు నిన్నేమి చేసినాడు—చెప్పుము.

సెట్టి:—మహారాజా! నన్నొక్కణ్ణే చేసి ఊరుకోలేదు—అద్దానికి—పాణానికి మానానికీకూడా బంగం కలుగజేసేడు.

ధీరం:—అక్కటా! ఈ దుష్టుని దుండగములకంతులేకున్నదిగదా!

ప్రతా:—అయ్యో! మహారాజుగారి సంతాపము నీవి మాటల వలన మరింత యధికమగునుకదా!

ఉదయ :—(ఆతురముతో) సెట్టీ! సెట్టీ! చెప్పుము భయపడకుము ఆ దుర్మార్గుఁ డేమిచేసెనో సవిస్తరముగ సెలవిమ్ము.

సెట్టి :—సెప్పుకుంటేమాత్రం ప్రయోజనమేటి మారాజా! మీరాయన్ని దండిస్తారా? మంకలేస్తారా? కేసు తేస్తారా? కూడ సేస్తారా? ఏటీలేదు. ఇంక అనవసరంగా మీకు సెప్పుకోటం వెందుకు ఆయనికి తెలిస్తే సెప్పుతాడా అని భూమ్మీద ఈ మాటలు గూడా లేకుండ సేస్తాడు.

క్రూర :—(తనలో) సెహబాస్! వైశ్యుండవగుటచే బుద్ధి సూక్ష్మత యున్నది.

ఉదయ :— సెట్టీ! నీవట్లు తలంపవలదు. ధర్మమునందున్న యాసక్తి నాకు బాంధవ్యమునందు లేదు. నేటివరకు క్రూరుని చర్యలను సహించితిని. ఇంక సహింపను.

క్రూర :—సహింపకున్న కాటికేఁగుదువు?

సెట్టి :—మారాజా! నిన్నరాతిరికాడ తప్పతాగి తూలుతూ, యిద్దరి దుర్మార్గులతో వచ్చి మా యింటితలుపు తట్టినాఁడు మీ తమ్ముఁడు.

ఉదయ:— (తనలో)"మీతమ్ముఁడ"నుమాట కర్ణకఠోరమైనది

ప్రతా :— పిమ్మట—

సెట్టి :—పిమ్మట లోనప్రవేశించి యినప్పెట్లు దోచినాడు. (ఏడ్చుచును) మా తాతలనాడనుంచి సెమటూర్చి ఉప్పు సింతపండు అమ్మి గూడబెట్టిన ధనం—పోయిందీ! రాజా! పోయిందీ! పట్టుకుపోనారు.

ధీమం :—ఔరా! దోపిడికిఁగూడ దొడంగినాఁడా?

ఉదయ :—అక్కటా సుక్షత్రియవంశ సంజాతుని కిట్టి యవినీతి కార్యములా?

సెట్టి :—మరాజా! డబ్బుపోతే పోనాది అంతతో వూరుకోలేదు

ప్రతా :—అబ్బా! ఇంక నేమిచేసినాడు?

సెట్టి :—బాబూ ! సెప్పడానికి నాలికాడదు-బాబయ్యా ! అయ్యో అయ్యో ! ఎంతగోరం ఎంతగోరం! పండంటిపిల్లగదా-సుక్కల్లో సందురుడులాగా, మెలుగుతున్నాదని-మొదవని మొదవని వూరుకోక మూడోసారి పుస్తికట్టినాను,

ధీమం :—ఆఁ! ఆఁ! ఏమిచేసినాఁడామెను ?

సెట్టి :—(గోలుమనుచు) ఏఁవని సెప్పుకోను మారాజా ! ఆమె కొంగట్టుకు లాగఁబోయినాడు. నాకు కోపంనాగక, తానలకాకున్నంచి మాలపడివున్న తక్కెడసిబ్బితో మొకాన్న కొట్టబోయేను.

ప్రతా :—సెబాస్ సాహసుకాగబిడ్డవయ్యా సాహసించి చక్కని పని చేసితివి

ధీమం :—పిమ్మట.

సెట్టి : (గోలపెట్టుచు) బాబూ ! యేటిసెప్పను వెనుకనుంగు శ్యాగ తేరేయి తట్లు !

క్రూర :—(తనలో నవ్వుచు) జన్మజన్మములకు మరచిపోకుము.

ప్రతా :—(సంతోషముతో) సెహబాస్ ! సెహబాస్! బాగా జరిగినది.

సెట్టి :—(ఏడ్చుచు) ఏటి మా రాజా ! నాకు తెట్లుతేరి-నేను దెబ్బలుతిని నా ముక్కు లిరక్కొట్టకొని-నా ప్రాణం పోగొట్టుకొని-నా డబ్బు ఒదులుకొని-నా పెళ్ళాన్ని పాడుసేసుకొని నే నేడుస్తూ గోలపెడు తూంటే మీకు బాగుందా ? మా రాజని మనవిసేసుకుంటే మరుకో రెండు తన్నమంటారా ?

ప్రతా :—(తెల్లబోయి) ఓయి, నీవువాసిన జెడఁబాదితివని తలంచి సంతోషించుచు నట్లంటిని.

క్రూర :—(తనలో) అదియే నీ బుద్ధిహీనత !

సెట్టి :—కాదు. బాబయ్యా ! కాదు అయనే నన్నూ, ఒప్పుకో లేదని మా యింటాంవిడని సెడమోదేను

ధీమం :—ప్రభూ ! ముందీ సెట్టిని బంపివైచి, పిమ్మట నా మన్మార్గుని విషయమై తగుశ్రద్ధను బూనవలయును

సెట్టి : ...మా రాజా ! సిల్లుగవ్వ లేకుండా పట్టుకొనిపోనారు.

ఉదయ :—సెట్టీ ! నీవు సాయంకాలము ఖజానాకు రమ్ము వచ్చిన యెడల నీవు పోగొట్టుకొన్న ధనము నీ కొసంగఁబడును ఇఁక మీఁద వానివలన నీవు బాధింపఁబడకుండ తగు శ్రద్ధను వహింతుము నీ విప్పటికి బోవచ్చును

సెట్టి :—(సంతోష మభినయించుచు)దండం మగ రాజాదండం! మీరు వెయ్యేళ్ళు సల్లగా వర్ధిల్లాలి (త లో) వొచ్చి మొరపెట్టుకున్నం దుకు లాబగించింది (ప్ర కా) బాబూ ! సెలవుతీసుకుంటాను సాయం తరం వస్తాను (నిష్క్రమించును)

ఉదయ :—(తల వాల్చి యాలోచన మభినయించును)

ధీమం :—రాజోత్తమా ! ఇఁక మనము మిన్నకుంటె రాకు సాహసించి ధర్మమునకుఁ గట్టువడి, వాత్సల్యము నావలకుద్రోసి క్రూరసేనుని క్రూరకృత్యముల నరికట్టనిచో—లోకోపవాదమునకు గుఱియగుదుము.

ప్రతా :—

శా. ఆలోచించెద వేల? సోదరుని య ♦ త్యాచార మూలించియున్
కాలాతీతము సేయఁజూడకు మిసీ ! ♦ కార్యంబసామాన్యమే ?
ఆలస్యా దమృతం విషంబనెడు వా ♦ క్యంబీవు పాటించి భూ
పాలా ! సోదరుఁబట్టిబందినిడుమా ! ♦ ప్రావీణ్యమే పారగాన్.

క్రూర :—(తనలో) ఔరా. నన్ను బందిఁబెట్టుమాని యాలో చనము సెప్పుచున్నావా ? కానిమ్ము నేను జెఱంబ్రవేశించుట కల్ల సూరు యఃపురముం జేరుకొనుట నిశ్చయము.

ధీమం :—అదియే యుత్తమకార్యము.

ఉదయ :—ప్రతాపా ! నీవు చెప్పినట్లు చేయువచ్చును. నేఁటి వఱకుఁ ప్రజలు గోలపెట్టుచున్నను, ఏకోదరుఁలముగదాయని కరుణించి

తిని ఇంక నట్టి కనికరముఁజూప వీలులేదు దుర్మార్గమును మాత్రిమె ల్లను బంధువర్గమునయినఁ బరిత్యజించును (మంత్రి నుద్దేశించి) అమాత్యశేఖరా! క్ష్మారసేనుని జెఱయందుంచుట మా సమ్మతి నెఱించుచు ఆజ్ఞాపత్రిమును వ్రాసి ప్రితాపుని కీయుఁడు.

ధీమం :—చిత్తము, (ఆజ్ఞాపత్రిమును వ్రాసి యిచ్చును)

ప్రితా : రాజోత్తమా! మీరింక నిశ్చింతతో నుండుడు, క్ష్మారసేనుఁడు చెఱలో నున్నాఁడనియే తలఁపుఁడు.

క్ష్మార :—(తనలో) మీ రెల్లరు యమపురిలో నున్నారనియే తలంపరాదా ?

ఉదయ :—సచివరా ! నేఁటి కిక సభ చాలింతము.

ధీమం :—చిత్తము, (అంత నావ్వురును నిష్క్రమింతురు)

క్ష్మార :— (ప్రవేశించి) అహో! ఏమి యీ ప్రితాపుని బుద్ధిహీనత! పులిమీసాలతో ఉయ్యాలలూగనున్నాఁ; నా మ్రోల వీని ప్రితాపమెంత! వీఁడు నాయొద్ద-నగ్నిలోని మిడుత-సింగపుఁ గొదమమ్రోల కురంగము! ఎంతసాహసము కోరి చావును దెచ్చుకొనుచున్నాఁడు. అపక్రి పరాక్రిమశాలినగు నన్నీ తుచ్ఛుఁడు చెఱయందుంపుమని సలహా చెప్పుట—వృద్ధరాజంగీకరించుట—మంత్రి సంతోషించి యాజ్ఞాపత్రిమును వ్రాసి యిచ్చుట—బాగుగనే యున్నది యమపురములో స్థలము ఖాళీగానున్నది. వీరిని ముగ్గురను ఏకముహూర్తమునఁ బంపితినేని యముఁడు సంతోషించును, వీరపాల శూరపాలురను బిలిపించి కార్య సన్నాహమున నేనుండెదనుగాక !

(నిష్క్రమించును, తెరపడును)

## రెండవరంగము

(ప్రవేశము క్ష్మారసేనుఁడు, వీరపాలుఁడు శూరపాలుఁడు)

శూర :—క్ష్మారసేన మహారాజా ! మమ్మిరువురను త్వరలోనే రావలసినదిగా నాజ్ఞాపించితిరేల ?

క్రూర :—(సంతోషముతో) శూరసేనా! నీ సంబోధనము సాభిప్రాయముగనే యున్న (కొంచెమాగి) మిత్రులారా! శత్రువుల నేమిచేయవలయును

శూర :—జాగుసేకులు లేక సమయింపవలయును

వీర :—(తనలో) ఈ దుర్మార్గుఁ డేదియో నరజాతియొక దురాలోచ మొనరించుచున్నాఁడు.

క్రూర :—నీఁటిరా నేఁ డొక విచిత్రము?

శూర :—(ఆశ్రముతో) ఏమది?

క్రూర :—ఏమున్నది? ఉదయసేనుఁడు నన్నుఁ బట్టి కారాగృహమున బెట్టుమని ప్రతాపున కాజ్ఞ యిచ్చినాఁడు

శూర :—ఔరా! ఎంతసాహస మెంతసాహసము?

వీర :—ప్రభూ! మిమ్ములను జెరయందుంచుట కెవ్వఁడికిసాధ్యము?

క్రూర :— వీరపాలా! నీవు చెప్పినమాట నిక్కువమే కావచ్చును నేను శక్తిసంపన్నుఁడనే కావచ్చును. కాని శత్రువు నుపేక్ష చేసినచో నేఁడుగాకున్న రేపయిన మనకు ముప్పుతప్పదు అకుసుదొక్కనేల? కాలుకడగనే? శత్రువుల కవకాశ మీయనేల? పిమ్మట దోట్రుపడనేల? ఆరంభముననే జాగరూకత వహించి, కార్యముం జక్కఁబెట్టుటొప్పదా?

శూర :—దేవా! మీ మాట యుక్తమే! మే మిరువురము విశ్వాసపాత్రులమగు బంటులము మొదటినుండియు మిమ్ముల నాశ్రయించుకొనియుంటిమి మీ కొఱకుఁ బ్రాణముల నర్పించుటకైన వెనుదీయము, మాకు సత్యముతో సంబంధములేదు న్యాయముతో బనిలేదు. ధర్మమునం దాసక్తి లేదు. మీ యాజ్ఞలం బాలించుటకు—అసత్యము లాడుటకు జంకము—హత్యలుసేయుటకు గొంకము. దొంగతనములోఁ బ్రసిద్ధులము—దోపిడిలో నిపుణులము—బజారులలోఁ జక్రవర్తులము మా సామర్థ్యము మీకుఁ దెలియునిదా? కనుక సందేహమ్ము మాని కర్తవ్యము నిరూపించుఁడు

క్రూర :— (సంతోషముతో) వాని బుజమును దట్టుచు) సెహ బాసు మిత్రుడా! నీవంటి ధీరశాలి నా యండ నుండగా నాకు లోప మేమి? (ఇంచుక సేపాగి) ప్రస్తుత కర్తవ్యము మిది. నన్నుం గారాగారనివాసునిగాం జేయందలచినందులకుగాను, ఆ ముగ్గురినీ ఈ రాత్రియే నిద్రించుతరి వధింపవలయును.

వీర : – (తనలో) ఔరా! ఎంతటి క్రూరకార్యమునకు, బురి కొల్పుచున్నాడు. యుక్తివాక్యములచే నెమ్మదిగా వీని మనస్సుం ద్రిప్ప యత్నించెదను. (ప్రకాశముగా) రాజా! మనము నిద్రించువారిని పందలవలె పైంబడి చంపనేల?

క్రూర : లేకున్న ధైర్యవంతులవలెం జంపుట యెట్లు?

వీర :—యుద్ధంచేసి.

క్రూర : (అట్టహాసంగా నవ్వి) వీరపాలా! నేడు మద్యపానము సేయ మరచితివా? మందనివలె మాటాడుచున్నావు మనము వారితో యుద్ధముసేయుటెట్లు? మనకు సైన్యమా? లేదు! ధనమా? పూజ్యమా? ప్రజాభిప్రాయము కలలోనివార్త. ఆయుధములా? మృగ్యములు—ఇంకం జతురంగబలశోభితుండ ఉదయసేనునితో యుద్ధము సేయుటెట్లు? మఱియొక విషయము—మనమీనాడు మిన్నకుంట మేని ప్రతాపుండు సామాన్యుడుంగాడు—వాడు తప్పక తగిన పరివారముతో వచ్చి నన్నుం బట్టికొనంగలడు; కనుక మోసమే యిప్పట్ల మనకాచరణీయము.

వీర :—(తనలో) ఈతడు కడుంగడు దుష్టుడు తలపెట్టిన పనిని చేయకుండ విడువడు. వీని కడ్డుతగులుట మంచిదిగాదు; కొంచ మిట్లే మాటలాడి ధనమును గుంజెదను. (ప్రకాశముగా) మహారాజా! నేడేలనో నా హృదయము హత్యలకంగీకరింపకున్నది శూరపాలుడు సహాయముతో మీరు కార్యమును సాంతముచేసి లబ్ధవిజయులుకండు.

క్రూర :—(తనలో) ఈతం డదినెరింగి కొంచము విత్తములాగుటకై యిట్లు పలుకుచున్నాడు. కానిమ్ము. అవసరము వచ్చినప్పుడు

4

పెట్టెకు తప్పదు. (మెడలోని ముత్యాలహారము తీసియిచ్చి) సర
పాలా! నీవు గైకొనుము. వెంటనేపోయి శూరపాలునితో గూడ
సన్యాసుల గోలిరమ్ము దానితో గానలసినంతి యుత్సాహ...
...ంచును. ఒక్క హత్యమాత్రమేకాదు పదివేలహత్యలను చేయగలవు

సీ. సాహసంబునకిల్లు ♦ జారత్వమునకునిక్క-
ప్రధితక్రౌర్యమునకుఁ ♦ బట్టుగొమ్మ!
దోపిడికాంక్షలకు ♦ దొడ్డపా చేయూత
హత్యలన్నిటికిని ♦ ఆటుపట్టు!
మోసంబునకుఁ దండ్రి ♦ రోషంబునకుఁ దల్లి
దొంగతనాలకు ♦ దంగఁడీఁడు!
ఋజుమార్గమునకు శ ♦ త్రువు; డంబమునకూత
జూదగాండ్రకు ముద్దు ♦ సోదరుండు!

గీ. అట్టి మద్యపానముచేత ♦ నలవికాని
కార్యమొండున్నదే యిల? ♦ కనుక నీవు
దానిసేవించి మదియందు ♦ స్థైర్యమూన
సత్వరంబున రాఁగదే ♦ సఖుఁడమగిడి.

(శూరపాలు నుద్దేశించి) శూరపాలుడా! నిన్నుఁగూడ ...
...తిన సంతోషపెట్టెదను, రేపు సింహాసన మధిష్టించినపిమ్మట ...
...కు మాత్రము రాజును పాలనాదికమంతయు మీ మీ ...
...యుందును.

శూర.—దేవా! మీకు నాకింతగా జెప్పవలయునా?

క్రూర.—మిత్రులారా! మీ రింకఁ దడయనేలా

గీ. ఏను పోవుచున్నాఁడ ♦ నిపుడు కాఁగ
గార్యనిర్వాహమున కింకఁ ♦ గడఁగుఁడించుఁ
జెప్పి భానుండదె గగన ♦ సీమవీడి
పశ్చిమాంబుధిలోనఁ దా ♦ బడుచునుండె.

సాంధ్యరాగము సలుగడల నలముకొనుచున్నది మీ శే షముఁ మడఁగినపిమ్మట ఆయుధపాణులై నా మందిరమునకు రండు — మున్ముందు ధీమంత ప్రతాపులను కాఁజేసి, పిమ్మట ఉదయసేనుని జక్కఁజేయవచ్చును.

వీర :— ప్రభూ! మే మిఁకపురము పోవుదుము. సరిగా మీరు చెప్పిన తిరుణమునకు వచ్చెదము.

క్రూర :—మంచి పనిసేయుఁడు నేను మీ రాక కెదురు చూచుచుందును. మీరు తెచ్చుకత్తులు మిక్కిలి పదునుగలవిగా నుండ వలయును, అదిమాత్రము మఱచిపోకుఁడు

వీర :—చిత్తము శూరపాలా! రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు)

క్రూర :—(స్వగ) ఔరా! ధనమేమి చేయుఁబడు? ఆసా మాను నేసిన వీరపాలుఁడు ముత్యాలహారముఁ జూచుటతోడనే, ముందం జవేసినాఁడు. కడుటక్కరి! శూరపాలునకు నే నిరున్నంత చాతుర్యము లేదు. ఎట్లుచెప్పినను వాఁడొప్పుకొనునా. నే డట్లుకాదు— మనమూను కాలముగా ధనసంగ్రహణము సేయకమానను. కానిమ్ము కార్యసాఫ ల్యమే యిప్పట్ల ఆవశ్యకము (ఉదయసేను నుద్దేశించి) ఓ వ్యర్థధర్మ కమా! ఉదయసేనా! నీవి క్రూరసేనుని సామర్థ్యమెఱుంగవు. ప్రజ నా నోచుకొనుచున్నాఁడు స్త్రీలను జెఱఁబట్టుచున్నాఁడు అనియే తలంచి తివి. వెఱ్ఱివాడవు. నేఁడు పసునుక త్తితో నీ కుత్తుకనుబట్టి కోయఁగలఁ నని తెలిసికొనలేకపోయితివి నీనా? నన్నుఁ జెఱబెట్టునది? ఓ ధీమంత ప్రతాపులారా!

గీ. క్రూరసేనుఁడు దుష్టుఁడం • చేమొ ప్రేలి
నారు చెఱఁబెట్టఁగాఁ జూచి • నారు మీరు;
మిమ్ము మువ్వురఁ గడతేర్ప • నెమ్మనమునఁ
దలఁచి, యీ రాత్రి కత్తుకల్ • తరిగెదేను.

ఇఁకనేఁబోయి కార్యసిద్ధికి వలయు ప్రయత్నములనుజేసికొందును.
(తెర పడును, నిష్క్రమించును)

## మూడవరంగము-అంతఃపురాంతర్భాగము

(ప్రవేశము—కమల, మంజువాణి)

కమ :—చెలీ! మంజువాణీ! నేఁడీకను నాథుఁడు రాకయుండుటకుఁ గారణమేమి?

మంజు :— దేవీ! నేఁడు ప్రభువువారు సభ దీర్చియుండఁగా త్యాలగు రామిసెట్టి నచ్చి—

కమ :—(అర్ధోక్తిలోనే) వచ్చి-చెప్పుము! వినుటకుఁ గుతూహల మధికమగుచున్నది.

మంజు :— గతరాత్రి క్రూరసేనుఁడు శూరపాల వీరపాలురను అనుచరులతోఁగూడ దన యిల్లుంజొచ్చి, ధనమంతయు దోచుకొనుట మాత్రమేగాక, అకటా! చెప్పుటకు నోరు రాకున్నది.

కమ :—ఆహా! ఎట్టి యత్యాచారము లొనరింపుచున్నాఁడు. పిమ్మట.

మంజు :— పిమ్మటఁ దన భార్యను బలాత్కరించినాఁడని మొఱ పెట్టుకున్నాఁడు.

కమ :—(చెవులు మూసుకొని) శ్రీహరీ! ఎంతటి దారుణకార్యము లాచరించుచున్నాఁడే? ఎల్లప్పుడు మన్నాథునికి వీనిని గూర్చిన మనోవ్యాథియేకదా! ఎన్నియో పర్యాయములు పరకాంతలను బట్టవలదని చెప్పిరి.

సీ. మధుపానములమాని ♦ మసలుమంచును సదా
నాథుఁడు బోధించె ♦ నయముమీఱ
బరభామలనుబట్ట ♦ పాపమంచును సదా
నాథుఁడు బోధించె ♦ నయముమీఱ
చౌర్యంబు విడనాడి ♦ సంచరింపుమటంచు
నాథుఁడు బోధించె ♦ నయముమీఱ

దుష్టసాంగత్యము • తొడరెవిడుమటంచు
నాథునకు బోధించితి • నయముమీఱ
గీ. ఎంతబోధించినను వాని • స్వాంతమందు
సంతయును మార్పులేకుంట • చూడనక్కట!
పట్టి దండించుటొప్పదే • ప్రాణనాథ!
పతిని సోదరుండన్ మాట • మతిసినసి.

మంజువాణీ! గతరాత్రి నాకొక దుస్స్వప్నము వచ్చినది అప్పటి నుండియు నా మనస్సు కలతజెందియున్నది. నీవీ వర్తమాన మెఱిగించినపిమ్మట మఱింత దిగులగుచున్నది.

మంజు:—అమ్మా! ధైర్యము వహింపుడు మీకు వ్యాకులత యెందులకు? స్వప్నములకు శకునములకు లెక్కసేయనేల? (కొంచె మాగి) పాదములచప్పుడు వినబడుచున్నది మహారాజుగారు గాబోలు నిటు వచ్చుచున్నారు నే నేగుచున్నాను. (నిష్క్రమించును)

(అంత విచారగ్రస్తుడై ఉదయసేనుఁడు ప్రవేశము)

కమ:—(ఎదురేగి) నాథా! నేఁ డింతసేపటివఱకుఁ వడసితిరేల? (ముఖలక్షణములఁ బరికించి) అయ్యో! నాథా! ఇదేమి? మీ నేత్రము లశ్రుపూరితములైనవి? ముఖమున దీనత్వము పొడసూపుచున్నది. కారణము మెఱింగింపుఁడు. ఏలకో నా చిత్తము తత్తరపాటుం జెందుచున్నది.

ఉదయ:—(నేలఁ గూలబడి) అకటా! ప్రాణేశ్వరీ! నే నేమని చెప్పుదును? పవిత్రమంబగు నా తల్లిగర్భమున నాతోఁబా టొక రాక్షసుఁడు క్రూరసేనుఁడు-హంతకుఁడు జనియించినాఁడు.

కమ:—నాథా! వానిచర్య లెప్పుడును వినుచునేయున్నాము నేఁడు వింతలేమయిన నున్నవా?

ఉదయ:—అయ్యో! వింతలందువేమి? హా ధీమంతా! బుద్ధికుశలతచే బృహస్పతిని ధిక్కరించువాఁడవుగదా!

కమ :—(తనలో) ఏమి నాథుఁ డీట్లు ధీమంతుని దలంచి విలపించుచున్నాఁడు. (ప్రకాశముగా) ప్రాణనాథా! ధీమంతునకు కుశలమేనా?

ఉదయ :—(ఏడ్చుచు) అయ్యో! ఇంకెక్కడి ధీమంతుఁడు క్రూరసేనుని వాడిఖడ్గమునకు ఎరయైపోయినాఁడు.

కమ :—(విషాదాశ్చర్యములతో) ఆఁ! ఆఁ! క్రూరసేనుఁడు మంత్రిసత్తముఁడగు ధీమంతుని హత్య గావించినాఁడా?

ఉదయ :—ఒక్క ధీమంతుఁడేకాదు, సేనాధిపతియగు ప్రతాపుఁడుకూడ నా ఖలుని ఖడ్గధారచే ఖండితశిరస్కుఁడాయెను.

కమ :—(ఇంచుకసేపు స్తంభీభూతయై) అన్నన్నా! ఎంతదారుణ మెంతదారుణము?

ఉదయ :—(దుఃఖించుచు అయ్యో చెలీ! దారుణమని నెమ్మదిగా ననుచున్నావా? ఇఁక నాకు బ్రతుకెందులకు?

కమ :—అయ్యో! నాథా! అమంగళము లాడెదరేల?

ఉదయ :- ప్రాణేశ్వరి!

సీ. బుద్ధి బృహస్పతిం ♦ బోలిన ధీమంతు
నెడఁబాసి పాలనం ♦ బెట్లుసేతు?
వీరాగ్రగణ్యుఁడై ♦ పోరుగాంచిన ప్రతా
పుని బాసి ధరణిపై ♦ మనుటయెట్లు?
పరకాంతులనుబట్టి ♦ భంగ మొందించెడు
క్రూరుండు సమృద్ధిఁ ♦ గోరఁడకట!
వాని దౌష్ట్యంబునో ♦ ర్వరికింప దుర్యశ
మొదవుచున్నది ♦ కదా యుర్వినాకు

గీ. ఇంక నేరీతి మనువాఁడ! ఏమిసేతు?
ఎవరి వేఁడుదుఁ గర్తవ్య ♦ మెఱుఁగ నబల!
అంతచేసిన ఖలుఁడు న ♦ న్నవనియందుఁ
బట్టి చంపఁడే తరుణము ♦ వడసినంత.

కమ :—(చెవులు మూసుకొని) హరిహరీ! నేడిట్టి యశ్లీల ములు వినఁబడుచున్నవేమి? (తనలో) అక్కటా! గతరాత్రి నేఁగనిన దుష్టస్వప్నమున కనుగుణ్యముగఁ బొడసూపుచున్నవేమి పరిస్థితులు. ఏదియెట్లుజరిగినను నాథునకు దుఃఖోపశమన మొనర్పవలయును. (ప్రకాశముగా) హృదయేశ్వరా! మీ నోటినుండి యిట్టిమాటలు వెలువడిన నా మనస్సెట్లుండును? లోకములో ధర్మము యెప్పటికైనా జయించును. అధర్మము నశించును. నేఁడు మీ సోదరుం డొనరించు దుష్కార్యములను సర్వసాక్షియగు సర్వేశ్వరుఁడు చూచుచునే యున్నాఁడు!.........

ఉదయ :—జీవితేశ్వరీ! ఆ దుష్టుని క్రూరకృత్యముల కంతుం డునా? ఎప్పటికయినా వాఁడీల్గునా?

కమ :—నాథా! అట్లందురేల? ఆతఁడు పశుప్రాయుఁడై, నిర్దయుఁడై, యిట్టికార్యము లాచరించినచో వానిపాపము వానినే బద్ధులు సేయును, దశకంఠుఁడు-జలంధరుఁడు-కీచకుఁడుమున్నగు వారెంతమందు తమ కర్మఫలముల కధీనులై చావలేదు? విచారముడుగుడు; వ్యాకులమును బోనాడుఁడు; ధైర్యముం జిక్కఁబట్టుడు (ప్రక్కకుఁజూచి) నాథా! తారా కనకసేను లిటేవచ్చుచున్నారు.

(అంత తారా కనకసేనులు ప్రవేశము)

తార :—జనకా! వింటివా? పినతండ్రిగారి దుష్కార్యము?

కనక :—అక్కా! ఆ దుష్టుని బినతండ్రియనుట నీ దోషము; హేమంత ప్రతాపులను గంటకాలను కిందట హత్యచేసిన • యా ఖలుని నామ మీ యర్ధరాత్రమునం దలంపరాదు.

(అపుడు క్రూరసేన వీరపాల శూరపాలురు ప్రవేశించి, రహస్యముగ స్తంభమునానుకొని నిలువఁబడి యుందురు.)

ఉదయ :—కనకా! మంచిమాట చెప్పితివి.

కమల :— నాయనా! అమ్మా! మీ రిరువురు నింతసేపటి వరకుఁ దెలిసియున్నారె దులకు? బుడుతులగు మీరు పెందలకడ నిద్రింపరాదా?

తార :—అమ్మా ! మేము నిర్ణయించినవారమే ధీమంత ప్రతాపుల హాస్యాసమాచారము నగరులో అలజడి కలిగింపఁగా లేచి యిటు వచ్చితిమి.

కమ :—మీ రిరువురు వచ్చి యిక్కడ బరుండుడు.

(తారా కనకసింహు లట్లుచేయుదురు)

ఉదయ :—ప్రేయసీ ! నేఁడేమియోగాని: హృదయము భారమెక్కుచున్నది.

కమ :— నాథా ! దుఃఖభార మట్లనుపించును, లెండు ; నా యొంకతలమున శిరముంచి నిద్రింపుఁడు.

ఉదయ :—(అట్లుసేయును)

(అంతఁ గొంతసేపటికి నిమ్మట ఆయుధపాణియగు క్రూరసేనుఁ డుదయసేనునిమీఁదికిలంఘించి ఆతనికుత్తుకఁ గోయుచుండును ; శూరపాలుఁడు కమల కంఠమునకుఁ గత్తి గుచ్చిసేయును ; వీరపాఁడు తారా కనకసింహులంబట్టుకొనును, హాహాకారములు-ఏడ్పులు-బొబ్బరింతలు)

తెర పడును, (ప్రథమాంకముసంపూర్ణము)

## హెచ్చరిక



# కపటతార

## ద్వితీయాంకము

### మొదటి రంగము

(ప్రవేశము మంజువాణి, సులోచనుఁడు)

సులో :—మంజువాణీ! బెబ్బులిం జూచి పరుగులెత్తు గోవు చందమున నట్లు భయపడుచున్నావేమి?

మంజు :—(నెత్తిమొత్తుకొనుచు) అయ్యో! అయ్యో! ఇంక నేమున్నది సర్వనాశనము. అబ్బా! అబ్బా! ఆ దృశ్యమును జూచి నది మొదలు నాలుక తడియారిపోవుచున్నది కన్నులు తిరుగుచున్నవి.

సులో : (తనలో) ఈమె యేదియో దారుణసంఘటనము జూచియుండవచ్చును. లేకున్న నింతభీతిల్లియుండదు. (ప్రకాశముగా) మంజువాణీ! అసలువిషయమును దెలుపక, నాకు మనమునఁ గలఁతఁ బుట్టించుచున్నావు.

మంజు :—అదుఁగో—అదుఁగో—బాబూ—చంపకు,

సులో :—(నలుప్రక్కలంజూచి) బేలవై యేల భయపడుదువు నీ మాటలు కడుంగడు చిత్రముగనున్నవి ఎవరిని చంపవలదని వేఁడు కొనుచున్నావు?

మంజు : (ఇంచుక సేద దేఱి) ఏమి? క్రూరసేనుఁడు ఖడ్గధారుండై యిటువచ్చుటలేదా? నిజముగ నాతఁ డిక్కడ లేడా?

సులో :—(తనలో) ఏదియో కొంపమునిగినది. లేకున్న నీమె యింత తల్లడిల్లదు. (ప్రకా) మంజువాణీ! క్రూరసేనుఁ డెక్కడ నున్నాఁడు చెప్పుము. ఆతఁ డేమిచేసినాఁడు.

మంజు :—(నలుప్రక్కలఁజూచి) సులోచనా! కొంపమునిగినది. దుర్మార్గుఁడు-రాక్షసుఁడు-క్రూరసేనుఁడు అకటా! మహారాజా! అయ్యో! ఎట్టిదారుణము సంభవించినది ?

సులో :—(ఆత్రముతో) ఆఁ! ఆఁ! మహారాజున కాపద వాటిల్ల లేదుకదా !

అయ్యో! ఇంకెక్కడి మహారాజు! రాత్రి నిదించుచుండగా క్రూరసేనుఁడు ఖడ్గపాణియైవచ్చి మహారాజుగారిని కంఠమును-

సులో :—హా! మహారాజా! హా ఉదయసేనప్రభూ! ఎంతలో నెంత చేటుమూడినది ?

మంజు :—సులోచనా! ఆ ఖలుఁడు—ఆ మానవాధముఁడు మహారాజుగారి కంఠమును కోయుటతో తృప్తిచెందలేదు మహాసాధ్వి యగు కమలాదేవిని బలాత్క......

సులో :—(చెవులు మూసికొని) హరి హరీ! ఈ పాపపుజెవు లతో నెట్టిమాటలను వినుచున్నాను. (అంత నే పథ్యమున)

చ. "సుమశరుఁ డేయుబాణముల
సోలుచుఁ జాలుచు నున్న నన్ను నీ
వమల హృదంతరాళమున
నాదరమొప్పఁగఁ జూడవేల ? నా
సము లిలలేరు నీకుఁ గను
సన్నల మెల్గెదఁ గేళిఁదన్పవే !
కమలదళాక్షిరో ! యటులఁ
గాదనక నీ విక నుండనేర్తువే !"

సులో :—(వినుట నభినయించి) కాముక ప్రలాపములు వినఁ బడుచున్నవి; వా రెవ్వరై యుండుదురు ?

మంజు :— (ముందునకుఁ బోయి చూచి) అయ్యో ! అయ్యో! కొంపమునిగినది. క్రూరుఁడు సాధ్వీమతల్లియగు కమలవేణింబట్టి తన్నుఁ బొందుమని బలాత్కరించుచున్నాఁడు.

సు:లో :— హా తల్లి ! కమలాదేవీ ! భర్తృమరణముచే విదారితమైన నీ హృదయము నీ దుర్మార్గుఁ డెట్లు దుఃఖపెట్టుచున్నాఁడా

మంజు :—(ప్రక్కకుఁజూచి) అయ్యో ! ఇంకేమున్నది ? ఆ దుర్మార్గుఁడిటే వచ్చుచున్నాఁడు. రమ్ము పోవుదము పాఱిపోవుదము లేకున్న మనప్రాణము లు నిలువవు.

(తెర పడును. ఇరువురు నిష్క్రమింతురు)

## రెండవరంగము సముద్రతీరము

(ప్రవేశము—కమల)

కమ :— హా స్వామీ ! దీనదయాపరతంత్రా ! ఆర్తరక్షణదీక్షాదక్షా ! ఎట్టికష్టము లు తెచ్చితివి ? సద్ధర్మనిరతుండగు నా ప్రాణేశ్వరుని అకటా ! కటికివాఁడు మేకను గోసినట్లు ఖలుఁడు కోసినాఁడే ! అధమాధముండగు కీచకుఁడు ద్రౌపదిపయింబడ నుంకించినట్టు-దుశ్శాసనుం డామె వల్వల నొలువఁబూనినట్లు-దశముఖుండు సీతను గామింపఁ జూచినట్లు-అయ్యో ! ఈ దుర్మార్గుఁడు నన్నోనరింపుచున్నాఁడే ? ఇఁక నా కేదిదిక్కు ? నన్నెవ్వరు రక్షింతురు ? నామొఱ నెవ్వరాలింతురు?

సీ సురులార ! గిరులార ! ♦ హరులార ! కరులార !
పాపరే క్రూరుని ♦ బారి నాకు
మునులార ! జనులార ! ♦ ఘనులార ! ఫణులార !
పాపరే క్రూరుని ♦ బారి నాకు
యక్షులార ! రణ హ ♦ ర్యక్షులార ! యిపుడు
పాపరే క్రూరుని ♦ బారి నాకు
సిద్ధులారా ! సుప్ర ♦ సిద్ధులారా ! ప్రీతిఁ
బాపరే క్రూరుని ♦ బారి నాకు

గీ. భర్తఁ గడచేర్చు నిద్రించు ♦ సమయమందు ;
న్యాయ మన్యాయమనునది ♦ యరయఁబోక
వదినన నన్నుఁ బొందఁగ ♦ మదిఁదలంచె ;
పాపరే మీరు ! క్రూరుని ♦ బారి నాకు.

హా ! ఏమి పలుకకున్నారు ? మీలో నొక్కరకు నా మీఁద దయలేదు ; అనాథనై దుఃఖాగ్నికిం దదనమయి మిమ్ముల నతిదీనముగ వేడుకొనుచుండఁగా మీకు మనసు కరుగుటలేదా ? అకటా ! ఇఁక నా కేదిగతి ! (ప్రక్కకుఁ జూచి) అల్లదే మృగమును వెంటాడు వేటకానివలె నా దుర్మార్గుఁ డిటు వచ్చుచున్నాఁడు హా ! ఇఁకమాన సంరక్షణ మెట్లొనరించుకొందును ? (సముద్రముం జూచి సమీపించి) ఓ రత్నాకరా ! సాగరా ! దేవతలకుఁగాని భూదేవతలకుఁగాని నృపాలురకుఁగాని, దిక్పాలురకుఁగాని నా మీఁద దయపుట్టలేదు. తండ్రీ నీవైన నా కాశ్రయ మొసంగుము.

సీ. అల్లారుముద్దుగా ♦ నలరిన లక్ష్మిని
హరికిచ్చి పెండ్లి గా ♦ వించినావు !
రామభూజానికిఁ ♦ బ్రేమతో దారిచ్చి
భూపుత్రి యిక్కట్లు ♦ బాపినావు !
ఇష్టమృష్టాన్నంబు ♦ లెవ్వేళ నొసఁగెడు
కామధేనువు నిచ్చి ♦ కాచినావు !
సలలితపీయూష ♦ సంపద దయచేసి
ఎల్లదేవతలన్ ♦ నేలినావు !
గీ. ఏను పతిని గోల్పోయిన ♦ నింతి నకట !
పాపుఁడౌ క్రూరసేనుని ♦ బారిఁద్రోసి
ఆశ్రయంబిచ్చి రక్షింపు ♦ మయ్య ! నాకు !
అన్యులను వేడ నీవె న ♦ న్నాదరింపు !

అని సముద్రములోఁబడుచుండగా, క్రూరసేనుఁడువచ్చి పట్టుకొనును()

క్రూర :—(" సుమశరుఁడేయు బాణముల " అను పద్యముం జదువును)

కమ:—హా భగవంతా! నా మానంగాపాడవా? (మూర్ఛిల్లును)

క్రూర :—పోయిన మగనికొరకింత యేడుపెందులకు? అవక్ర పరాక్రమశాలిని—రూపజితమారుండను—నేటినుండి మహారా... నన్ను ప్రేమింపరాదా? నా కోర్కె తీర్పరాదా?

కమ :- (లేచి) ఛీ దుష్టుఁడా ఏమనుచున్నావు? మాతృసమాననగు నేను నీ కోరికను దీర్పవలయు...? పాపీ! సాధ్వీమణినగు నా భర్తను జంపి, నన్నాథనుఁజేసి, మీదుమిక్కిలి నా మానముం జెరుపఁ గోరుచున్నావా? నీ నాలుక చీలుకలుగాను.

క్రూర :—(పెడనవ్వు నవ్వుచు) నీయందలి మోహముచే ... కొంటినిగాని లేకున్న నిన్నుకూడా గతరాత్రి గతించినవారి సహా యార్థమై పంపెడివాఁడనే!

కమ :—అట్లు చేయుము. నాకు పరమానందము. నా ప్రాణేశ్వరుఁడు లేనప్పుడు నా కీ తనువేల? నిన్ను బ్రతిమాలుకొందును. నా నాథుని జంపిన కత్తితో నన్నుఁగూడ ఖండింపుము. అట్లు చేసితివేని నీకు పుణ్యముండును

క్రూర :—ప్రేయసీ! నిన్నుఁ జంపుటకుకాదు నా యభిమతము నీతోఁగూడి మన్మథు నారాధించుటే,

కమ :—ఛీ! దుష్టుఁడా! అగ్రజనిల్లాలినగు నన్నిట్టి కోరికను గోరుటకు, ఈ రీతిని సంబోధించుటకు నోరెట్లు వచ్చుచున్నదిరా దుర్మతీ! పరదారాగమనము సంతోషకరముగాదు వినాశకరమని యెఱుంగుము.

సీ. పరభామినుల పొందు ♦ వాంఛించుటనెగదా
కీచకుం డిహలోక ♦ గృహముఁవాసె!
పరభామినుల పొందు ♦ వాంఛించుటనెగదా
దశకంఠుఁ డాదిలో ♦ దగ్ధుఁడాయెు

పరభామినుల పొందు ♦ వాంఛించుట నెగదా
అలజలంధరుఁడు దా ♦ నశించినాఁడు!
పరభామినుల పొందు ♦ వాంఛించుట నెగదా
నరకాసురుఁడు మేను ♦ దొఱఁగవలసె!

గీ. ప్రథిత బలవంతులయ్యులు ♦ వసుధ నన్ను
అన్యకాంతలఁగోరుట ♦ నసువులుడిగి
యీడ్గరే యెందరెదరో ♦ యెరుఁగవొక్క-
అన్న భార్యను దయతోడ ♦ నరయుమయ్య.

క్రూర :—(బిగ్గఱగా నవ్వి) అహో! ఎంతధర్మ మేకరువుపెట్టితివి. పరకాంతలనుగోరి రావణాదులు మడిసిరనికదా నీవు చెప్పుచున్నావు నేనును వారివలె విగతప్రాణుండనయినఁ గావచ్చును. కాని నీ సాంగత్యమును గోరకమానను నా మానసము నీయందు లగ్నమై యున్నది.

కమ :—(తనలో) భగవంతా! ఇఁక నా కేదిగతి? (ప్రకాశముగా) అయ్యా! లోకములో అందగత్తె లెందఱులేరు; సర్వసమర్థుండవగు నీవు తలంచినచో వేనవేలువచ్చి నీ పాదములకడ వ్రాలుదురు—నేనా? నీకంటె వయసున బెద్దదానను; వృద్ధాప్యము తొంగి తొంగి చూచుచున్నది దుఃఖభావమున పరితపించుచున్నాను, ఇష్టములేనివారితోడి సరసము నీకు సంతోషము గలుగఁజేయదు; కాబట్టి వేఱొక యువతినిజూసి, నీ కామమును దీర్చుకొమ్ము.

క్రూర : — (నవ్వుచు) ఎంతమాటకారివి? నీ నక్కజిత్తులు నా యొద్ద సాగవు, ముసలిదానివయినను-రోగిష్టివయినను-కురూపిణివయినను నీవు నా కన్నుల కందగత్తెవు తానువలచినది రంభ! నీవు నా పాలిటి రంభవు-మారుమాటలాడక, నా కోర్కెఁదీర్పుము. లేకున్న బలాత్కరించెదను.

కమ :—(తనలో) అకటా! ఇపుడు నన్ను రక్షించువారెవ్వరు నా యార్తిం బాపువారెవ్వరు; ఇపుడు నాకేది కర్తవ్యము? (కొంచె

మూగి) పతివ్రతలకు మానమే ప్రాణము. మహోత్కృష్టమగు మాన
మును రక్షించుకొనుటకై ప్రాణములయిన బాసెదను.

క్రూర : సతీ! ఏమి యాలోచించుచున్నావు. కాలాతీతము
హృదయ మోపకున్నది.

కమ :—పాపాత్ముఁడా! నీవు నన్ను ముక్కలు ముక్కలుగఁ
జెండాడినను నేను నీకోరికనుసమ్మతింపను, అదియేనా కడసారి నిర్ణయము.

క్రూర :—(పెడనవ్వు నవ్వి) ఆలాగునా? ఆలాగునా? ఇప్పు
డెవరికొఱకు సమ్మతింతువో చూచెదఁగాక! (ప్రక్కకుదిరిగి) ఓశూర
పాల వీరపాలులారా! ఆ తారా కనకసింహుల నిటుఁ గొనితెండు.

కమ :—(దుఃఖించుచు) అయ్యో! అయ్యో! ఒకచెంపగొట్టిన
నీరు-వేరొక చెంపఁగొట్టిన పాలు-అన్నెపున్నెము లెఱుఁగని పసికూ
నలు, వారలతో నీకుఁ బనియేమి?

(అపుడు వీరపాల శూరపాలురు తారా కనకసింహులతోఁ బ్రవేశింతురు)

తారా :—హా తల్లీ! (ఆమె పాదములపైఁ బడును)

కనక : హా! ఎట్టిదుర్దశ వాటిల్లినది? (అనితల్లిని కౌఁగలించుకొనును)

క్రూర :—కమలా! ఆలోచించుకొనుము తుదిపర్యాయమిది
నిక్కముగా ఆలోచించుకొనుము (కత్తిచూపి)

గీ. కత్తి చేఁబూని వీరల ♦ కుత్తుకలను
గోయమందువా? లేకున్న ♦ కోమలాంగి?
ప్రేమ ననుఁబొంది దుర్భర ♦ కామవహ్నిఁ
బాపుదువ! యోజనముసేయు ♦ మానసమున.

కమ :—హా దైవమా! దైవమా! ఎంతటినిర్దయుఁడవయ్యా
(క్రూరసేనుని పాదములపైఁబడి) తండ్రీ! అపరాధినినేను, నా కుత్తుకను
గోయుము. పసిబాలురు లోకవృత్తము నెఱుఁగరు. వారిపై నీకింత
కఠినత్వమేల?

క్రూర :—నీవు నా కోరికను మన్నింపకుండుటచేత—

కమ :-(తనలో) హా బిడ్డలారా! నా కడుపునఁ బుట్టినందుల కిదియా ఫలము? మానసంరక్షణార్థమై యిమ్మెప్పుడు-ఈ ఖలుని ఖడ్గ ధారకు బలియాయవలయునా? దుర్భరము-దారుణము-సహింపను నేను కన్నులార మీ చావును జూడఁజాలను, ఓ సముద్రుఁడా! ముందు నన్ను నీలోఁ బ్రవేశపెట్టుకొనుము.

(పరువిడుచుండఁగా క్రూరసేనుఁ డడ్డునిలుచును)

క్రూర:-ఎక్కడికిఁ బోయెదవు? మిత్రులారా! మీరీ బుడుతలను సమీపమునఁ గల యరణ్యమునకుం దోడ్కొనిపోయి యట వధించిరండు—

తార:-హా! విధీ!

కనక:-హా తల్లీ!

కమ:-హా బిడ్డలారా! (అని సముద్రమునఁ బడును)

(శూరపాల వీరపాలురు తారాకనకసింహులఁ గొంపోవుదురు)

క్రూర:-చావుముండా చావు! నేఁటితోఁ బూర్తిగా పీడవదలినది ఇఁక నిశ్చింతగా నేనుండగలను. (నిష్క్రమించును, తెరపడును)

## మూడవరంగము-అరణ్యభూమి

(ప్రవేశము వీరపాల శూరపాలురతో, తారా కనకసేనులు)

తార:-హా దైవమా! నీకు మేమింత పగవారమైతిమా? అనాథబిడ్డలమగు మమ్ము బలవన్మరణము పాలుసేయుచున్నావా? పూర్వ మార్తుల నెందఱినో రక్షించితివందురే?

సీ. ప్రహ్లాదుఁగాంచిన ♦ భక్తవాత్సల్యంబు
ఏపీట దాఁగెనో ♦ యెఱుంగఁజెపుమ!

కనక:-ద్రౌపతిఁ నేలిన ♦ రక్షణాపటిమ నేఁ
డెందుఁబోయినదయ్య ♦ యెఱుగఁజెపుమ!

తార:-గజరాజు దయఁజూచు ♦ కౌతుకం బీతఱి
నేమాయెనో మాకు ♦ నెఱుగఁజెపుమ!

తారా కనక :—[అట్లు సేయుచుందురు]

వీర :—శూరపాలా! రమ్ము. వీరిని మనము సమూలముగఁ బంధుకొందము. పిల్లలారా! మరియొకసారి హెచ్చరించుచున్నాను జాగ్రత్త! క్రూరసేనుని కంటఁబడరాదు [ఇరువురు నిష్క్రమింతురు]

తార :—సోదరా! దిక్కులేనివారికి దేవుఁడే దిక్కు.

కనక :—లేకున్న వీరి మనస్సింతలోనే యిట్లేల మారవలయును? ఆ మహాత్ముఁడే అనాథబిడ్డలమగు మనలను రక్షించినాఁడు

తార :—సోదరా! అయ్యో! మన కెట్టి కష్టములు ప్రాప్తించినవి? ఆ భగవంతుఁడు బాల్యమునుండియే మనల నిట్లు కష్టముల పాలుసేయుచున్నాఁడు. తండ్రి హతుఁడాయెను. తల్లి మానసంరక్షణార్థమై సముద్రములోఁ బడినది హా విధీ!

కనక :—అక్కా! విచారము మునుగుము. దుఃఖించిన నేమి ప్రయోజనము. కర్మఫలము కాఁగోలు నిది నుభవింపతీరునా?

తార :—సోదరా! అబ్బా! మిక్కుటముగ దాహమగుచున్నది. నో రెండిపోవుచున్నది. హా దాహము! దాహము! [మూర్ఛిల్లును]

కనక :—అయ్యో! దాహపీడచే నీమె నేలఁబడి మూర్ఛిల్లినది నిర్మానుష్యము. దుర్గమమగు-ఈయరణ్యములో జలమెక్కడ దొరకును? వెదకి పురిసెడు నీరుదెచ్చి అక్క నోటిలోఁ బోయకున్న యీమె ప్రాణములుండవు. కష్టము లొంటరిగరావు కాబోలు! [నిష్క్రమించును]

[అపుడు మారఁడను కొండలనాయకుఁడు ప్రవేశము]

మార :—[పరుగునఁబోయి తారనుజూచి] బలే బలే! ఇన్నాళ్ళకి కలిగింది కటాచ్చం తల్లికి "నరబలి, నరబలి కన్నెపిల్ల కావాలి అప్పుడుగాని పతేచ్చిగంగానని" సెపుతూవుండాది కాళికాదేవి సంతోసగం కలిగేటట్లు ఈమె కంటబడింది. ఎవరో రాసోరి పిల్లలాగుంది నిద్దరోతుంది మంచిసమయం. తల్లీ! కాళీమతల్లి! నీకీ కన్నెపిల్ల రక్తం దారోత్తా! ఈమె మాంసాన్ని నంజుడుబెడ్తాను. అప్పుడు నాకు పతేచ్చిగం అయి, కోరిన వరాలిత్తావు సేటికి నా తపం పండాది

[అని మూఁపునఁ దార నిడుకొని గొంపోవును, తెర పడును]

ద్వితీయాంకము — సంపూర్ణము.

# కపకత్రౌర

## తృతీయాంకము

### మొదటి రంగము పల్లెవాని యిల్లు

[ప్రవేశము పల్లిగాఁడు— కమల]

పల్లి :— సెప్పే ! నీ కేటా మొగపాటం ? సముద్దరంలో పడి సచ్చేదాన్ని వలేసి తీసినానుకాదే ?

కమ — [తనలో] హా దైవమా ! ఎట్టికష్టములను గూర్చుచున్నావయ్యా ! మానసంరక్షణార్థమై క్రూరసేనుని బారినుండి తప్పించుకొనుటకు, సముద్రంలోఁబడఁగా నన్నీతఁడేల పైకి దీయవలయును ? తీసినవాని కిట్టిదుర్బుద్ధి యేల పుట్టవలయును ? అకటా ! సువిఖ్యాత చరిత్రుఁడైన యుదయసేనభూపాలుని కర్ధాంగినగు నేను—తుదకుఁ జేపలు పట్టుకొను పల్లెవానికిఁగూడ లోకువయితినా ?

పల్లి :— సెప్పవోలె ? నాకు దేగంలో యేడిపుడ్తా వుండాది. నిన్ను సూసినకాడ్నుంచీ, యేదో పుడ్తావుండాది మనస్సులో—

కమ :— అనాదీ ! నీకిది ధర్మమా ! సముద్రంలోఁబడి చావనున్నగాసిని నన్నేల బయటికిఁ దీసితివి ? తిసినందున కిట్టి కోరికను గోరుట భావ్యమా ? నీ పాదములకు మ్రొక్కెదను తుచ్ఛములగు కోరికలు కోరవలదు.

పల్లి :— యేటోలె ? ఒల్లు కంటుందే తెగనీల్గుతూండావు ; నా కేటిలోచే ? సుక్కలో చందరుడులాగున్నాను. రాగరాయణ్ణి వలేసుకు పోనానంటె కావలసినన్ని సేపలు పడ్తాను రోజుకు పదిరూపాయలు సంపాదకం సేస్తాను. కులపెద్దను. నన్నే వొల్లకపోతే, నాకంటే మంచోడు నీ రేడులోకాల్లో ఇంకో డెవడు దొరుకుతాడే.

[అంత త్వరితగతిని చీపురుకట్టతో, పుల్లి ప్రవేశము]

పుల్లి :— [తనలో] ఈ గడదు ఓ రాసోరివదు చుని వలోడ్డి తీసేడని సాటి జాలారోళ్ళు సెప్పగా నక్కావచ్చినాను [పరిక్రమించి]

## రెండవరంగము మహారణ్యము

(ప్రవేశము విజయసింహుడు, సుమంత్రి)

విజయ :— సుమంత్రీ! మనమీ యరణ్యమధ్యమునే ఈ రాత్రి సేనలతో నుండవలయుననిలోఁచుచున్నదే! చీకటిపడుటమనమార్గము కనిపింపదు కాని నా హృదయము ప్రాణమిత్రుఁడగు ఉదయసేనభూపతిని నిద్రలో వధించి వాని యాలిని బలాత్కరించి బిడ్డలను హత్యఁజేయబంపి కూరసింహుఁడు సింహాసనాధిష్ఠుఁడాయెనని సేవకాధిపుఁడగు సులోచనుఁడు పంపినవార్తను విన్నదిమొదలు—ఆ దుర్మార్గుని ససైన్యముగ నెపుఁడెదుర్కొందుమా యని వేగిరపడుచున్నది

(అప్పుడు దొంగలనాయకుఁడగు మారుఁడు ప్రవేశించి చాటున డాగియుండును)

సుమం :—రాజశేఖరా! తొందరపడనేల? ఈ రాత్రి యిట విడిసినపిమ్మట వేకువజాముననే లేచిపోయి ఆ కూరసేనుని శిక్షింతము

మార :—(తనలో) ఈ రాసోదిసిన్నోడు—కబుర్లనూ త్రే మా దొరయ్య కూరయ్యగారిమీదికి దొండో తైలాగుండాడు, కానీ ఈ రాత్రిరే పట్టుకొని యీన్నిక్కడ బందిలో పెడ్తాను

విజయ :— మంత్రీ! నీవు చెప్పినట్లే చేయఁదగును వనమంతయు కంటకావృతము—క్రూరమృగాలవాలము—అంధకారబంధురము సేనలు దూరమున విడిసినవి. ప్రస్తుతము మనమెక్కడ విశ్రమింతుము?

సుమ :—మహారాజా! ఈ యరణ్యములో మనకు సుఖమెక్కడ ఈ వృక్షముక్రింద విశ్రమింపుఁడు ఖడ్గధారినై నేనుగాపుండెదను

విజయ :—(అట్లు చేయును)

మార :—(తనలో) నేనుపోయి మా గుంపోళ్ళని లాక్కొచ్చి యీళ్ళ నిద్దరిని పట్టుకొని బందీలో పడేత్తాను దొరయ్య కూరయ్య సంతోషించి బగుమతులిత్తాడు. (తెరపడును నిష్క్రమించును)

## మూడవరంగము-అరణ్యము

(ప్రవేశము కనకసింహుఁడు)

(౪) కనక :—(దుఃఖించుచు) అక్కా! అక్కా! అయ్యో! మర్భర

దాహవేదనాపీడితవై "జలము జలమ"ని కేకలిడఁగా గొనితెచ్చు టకై పోయితినిగదా! జలముం గొనితెచ్చులోపల నీ వేమయితివి.? అక్కా!

సీ. సింహశార్దూలముల్ ♦ చేరి క్రూరంబుగ
నినుఁబొట్టలోఁ బెట్టు ♦ కొనెనెచెపుము!
దారుణవిస్యుఁడే ♦ క్రూరుడై ననువచ్చి
తన హస్తఁ బడఁవేసి ♦ కొనెనెచెపుము!
దాహపీడితవై ♦ తనువును ద్యజియింప
వనమృగంబులువచ్చి ♦ తినెనెచెపుము!
తమ్ముని కై మదిఁ ♦ దామసంబొదవఁగా
ననువీడి యెందయినఁ ♦ జనితేచెపుము!

గీ. అక్కటా! పుట్టినది మొదల్ ♦ వెక్కసపడి
యెఱుఁగవీవు; నిస్సహాయుఁడని ♦ నెంచియిపుడు
వదలితివె నన్ను నినువీడి ♦ బ్రతుకఁగలనె?
జాడఁ దెలియదు నింకేమి ♦ నలువవాఁడ!

హా దైవమా! అట్టుఁ దండ్రిని హత్యఁజేసితివి; తల్లిని సముద్రములో ముంచితివి, మమ్ముల నీ రీతిని వేఱుపరచితివి నీకు మా కుటుంబమున నింత యాగ్రహమేల? లోకములో ధర్మపరాయణులు సుఖింతురని పెద్దలందురే? అది కల్ల వట్టిమాట! ధర్మమునకే యుగమునఁదావు లేదు సత్యమునకుఁ జోటులేదు. న్యాయమున కాశ్రయము లేదు. హంతకులకు—అధర్మపరాయణులకు సుఖము—ఐశ్వర్యము—అభివృద్ధి కలుగుచున్నది, అదియే నిజముగాకపోయిన సద్ధర్మనిరతుఁడగు నా తండ్రి కట్టి దురవస్థయా? మహాపతివ్రతామతల్లి యగు మా తల్లికట్టి దుర్మరణమా? అన్నెపున్నెము లెఱుఁగని కసుగందులమగు మాకిట్టి యిక్కట్టులా? (కొంచెమాగి) ఇపుడు నా కేది కర్తవ్యము? ఎవరు శరణ్యము? ఆఁ! ఒకరిని శరణువేడ నేల? తల్లిని గోల్పోయి తండ్రిని గోల్పోయి, అక్కను గోల్పోయి, నే నొక్కరుండను యొంటికనై బ్రతుక

నేల? బ్రతికి చేయునదేమున్నది? నావంటి నిర్భాగ్యుఁ డున్న నేమిః? ఊడినను నేమి? నాకొరకు విలపించువా రెవ్వరు? నా యోగక్షేమముల నరయువా రెవ్వరు? ఏకాకినై అడవులలోఁబడి కష్టపడుటకు గుడ్డ, కడుపున కన్నము లేక బ్రతికియుండ నేల? ఈ రాతిబండపైఁ దలను గొట్టుకొని చనిపోవుదును (బండను సమీపించి, చేతులుజోడించి) ఈశ్వరా! నీ వెంత నిర్దయుఁడవైతివను, ఎంత పగ సాధించుచున్నను-నేను హృదయము నిన్ను మఱవఁజాలను.

గీ॥ దేశమును వాసి యీరీతి ♦ ధిక్కరిఁదిరిగి
బంధుగులు చుట్టములును, ఎ ♦ వ్వరును లేక
అడవిలోఁబడి కష్టంబు ♦ లందజాల
తనువుఁబాసెద; రక్షింపు ♦ తండ్రి నన్ను



(అని తలను బద్దలకొట్టుకొనబోవగా నొకముని ప్రవేశము)

ముని:—బాలకా! బాలకా! మరణింపవలదు సాహసము విడువుము మదీయ తపఃప్రభావంబుచే నీ వృత్తాంతం బెఱింగితిని.

కనక:—దేవా! మీ రెవ్వరు? దిక్కుమాలినవాఁడ నగు నాతో మీకుఁ బనియేమి? పన్నెండులకు చావనీయరు?

ముని:—ఓయీ! నీవు మాఱుమాటాడక వెంటనే బయలుదేరి తూర్పుదిక్కుగాఁ బొమ్ము. నీకు సర్వశ్రేయము లొందవును. సందేహము వలదు ఆలస్యము సేయకుము మహర్షి నగు నా మాటను గాదనకుము. నే నేఁగుచున్నాను. (నిష్క్రమించును)

కనక:—భగవంతా! స్వామీ! నీ చర్యలు దురవగాహములు; నీ లీల లద్భుతంబులు. ప్రాణులయందలి యాపం ద్యజించి నీలోఁ జేరనుండఁగా మరల నిది యొకటా! కానిమ్ము. నీ యిష్టము వచ్చినట్లు చేయుము దేహధారులెల్లను నీ చేతులందలి కీలుబొమ్మలు గదా! మునివచన మనుల్లంఘనీయము-తూర్పుదిక్కుంబట్టి పోయెదను

(నిష్క్రమించును, తెర పడును)

# నాల్గవరంగము అరణ్యము

(ప్రవేశము కమల—వీరసింగు)

కమ:— అయ్యా! ఆ వ్యాఘ్రరాజము నా యందు కరుణించి, నన్ను దన పొట్టం బెట్టుకొనంగోరగా నీవేల దానిని వారించితివి? నిర్భాగ్యనగు నా కింకను కష్టములు తప్పవా?

వీర:— అమ్మా! నీ మోమున దీనత్వము పొడసూపుచున్నది మాటలయందు విరక్తిభావమున్నది కోరి చావుం దెచ్చుకొనునంతటి కష్టము నీకేల? నీ వృత్తాంత మెఱింగింపుము

కమ:—(తనలో) ఆహా! నాధుఁడు గతించినపిమ్మట నెన్ని దినములకు సత్పురుష సందర్శనమయినది? ఈ మహాభాగుఁడెవ్వఁడో ధర్మపథగామి (ప్రకాశముగా) తండ్రీ! నే నొక దిక్కుమాలినదానను అనాథను. నా వృత్తాంతముతో నీకుఁ బనియేమున్నది మరణింపనుం డంగా నది తప్పించితివి ఇఁక నెట్లు బ్రతుకుదునని మాత్రము నాకు విచారమగుచున్నది.

వీర:— తల్లీ! నీ వొక మహాపతివ్రతవు; సంపన్న గృహస్థు రాలివి; కాలకర్మవశముచేఁ గడగండ్లపాలైయున్నావని నాకుఁ దోఁచు చున్నది నీయందు నాకు భక్తిభావములు కుదిరినవి. మా యింటికి దయసేయుము అక్కడ స్వేచ్ఛగా నుండుము నా కిరువురు భార్యలు గలరు గృహకృత్యములను నీ వేమియుఁ జేయనక్కరలేదు నిన్న త్యంత గౌరవముతో జూతును సందేహ ముడిగి నా వెంటరమ్ము.

కమ:—(తనలో) దైవమా! మరల నిదియొక సంఘటనమా? కానిమ్ము; నీ లీల లతిక్రమించుట కెరికి శక్యము. (ప్రకాశముగా) ఓ పుణ్యపురుషా! నాయం దిట్టి వాత్సల్య మూనినందులకు నేను కృత జ్ఞురాలను నీ యాజ్ఞను బాటింతును.

వీర:— తల్లీ! సంతోషము! రమ్ము పోవుదము.

(ఇరువురు నిష్క్రమింతురు, తెర పడును)

తృతీయాంకము—సంపూర్ణము.



# కనకతార

## చతుర్థాంకము

### మొదటి రంగము విజయసింహుని నగరు

(సింహద్వారమువద్ద భటుఁడు)

భటుడు.—(తనలో) అకటా! నేఁటి కనేకదినములు గడచి పోయినవి. విజయసింహమహారాజుగారి జాడ యావంతయుఁ దెలియ లేదుగదా! మిత్రద్రోహుఁడగు నుదయసేనమహారాజు సోదరునిచే హత్యగా వింపబడెనన్న వార్తను వినుటతోనే ససైన్యముగ వానిని దండించు టకై పయనమైపోయిరి ఒకనాఁ డరణ్యమున నిశీథమగుటచే విశ్రమించి రఁట! తెలివిమాలిన యా సైనికులు పరిసరముల విడిసిరఁట! కాని యదేమిపాపమో! తెల్లవారకపిమ్మట నెంత వెదకినను రాజుగారు కనఁబడలేదట! వారికిఁ గావలి గాయుచున్న మంత్రిమస్తకము తెగి పడియున్నదట! అబ్బా! రాజగారి జాడఁ దెలియుటకు నగరులోని యమాత్యచమూపతు లెంతొ ప్రయత్నించిరి కాని యేమిలాభము! ఎందఱు చారులేఁగిన నేమి? ఎన్ని దేశములు తిరిగిన నేమి అంతయు నిష్ఫలమే! రాజు లేకుండుటచే రాష్ట్రమున నరాజక మధికమగుచున్నది పురోహితులవారి యాజ్ఞానుసారము ఈ సింహద్వారమున దుర్గం బ్రతి ష్ఠించిరి. ఎవ్వఁ డీ కవాటము నెరచుకొని లోనఁ బ్రవేశింపఁగలఁడో వానిని రాజ్యాభిషిక్తునిగాఁ జేయుట కమాత్యచమూపతు లువ్విళ్లూరు చున్నారు. ఇన్నిదినములు గడచినను నెవ్వరు రాలేదు. (ప్రక్కకుఁ జూచి) అహో! నవమన్మథాకారునివలె నున్న యా బాలుఁడెవ్వఁడు? ఇటులనే వచ్చుచున్నాఁడు.

(అప్పుడు కనకసింహుఁడు ప్రవేశము)

కనక :—ఓయీ! ఈ భవన మెవ్వరిది? మార్గాయాస ముపశ మించుకొనుట కిందించుక సేపు విశ్రమింపవచ్చునా?

భటు :—మీ రెవ్వరు?

కనక :—నే నొక రాజకుమారుఁడను

భటు :—ఆ కవాటం తెరచి లోనికిఁ బొండు.

కనక :—(కవాటం దెఱచి లోనికిఁ బోయినాఁడు)

భటు :—(సంతోషముతో) ఆహా ఈ మహాత్ము డెవ్వఁడో! అవలీలఁగాఁ గవాటమును దెఱచి లోనికిఁ బోఁగలిగెను! నేఁటితో మా కష్టములు గట్టెక్కినవి. నేనుపోయి అమాత్యశేఖరున కెఱిఁగింతును.

(తెర పడును, నిష్క్రమించును)

## రెండవరంగము అరణ్యము

(తెర యెత్తఁగా ప్రవేశము విజయసింహుఁడు)

విజయ :—(తనలో) అన్నన్నా! ఈ దుర్మార్గులగు దొంగలు నన్నెంతపనిచేసినారు! నాఁటిరాత్రి చెట్టుక్రింద విశ్రమించియుండఁగా గుంపులుగానచ్చి మంత్రింజంపి, నిద్రితుండనగు నన్ను మత్తుమందు సహాయముతోఁ గొనివచ్చి యీ చెఱలోఁ బడవేసిరి. కానిమ్ము, వారి కిప్పుడు తగినట్లు చేసితిని మోసమునకు మోసమే ప్రతిక్రియ యని తలంచి, తప్పత్రాగి యొడలెరుంగక పడియున్న యీ దొంగల కన్నులలోఁ గారముకొట్టి చెఱసాలనుండి ఈవలఁ బడితినిగదా ఇఁక నిక్కడ దడయరాదు, ఆ! తడసిన నేమిభయము? హస్తమునందు ఖడ్గము న్నదిఁ దొంగ లొక్కరుగాదు పదివేలమంది వచ్చినను వారికుత్తుకలం బట్టి పటపటఁ గోసెదను, నాఁడే వారు మత్తుమందు జల్లకున్న యెడల నేను వారికి జిక్కుదునా?

(నేపథ్యమున హాహాకారము)

విజయ :—(ఆలకించి) ఆఁ! ఏమిది? ఈ దుర్గమారణ్యములో కోకిల స్వరమును మరపించు మృదుస్వరముతో హాహాకారము చేయు

చున్న యీ అబల యెవ్వరు? (ప్రక్కకుఁజూచి) ఔరా! ఏమి వాని దారుణమే! ఏమి వాని సాహసము! నాపై మత్తుమందుఁ జల్లి నన్నుఁ జెఱఁబెట్టిన దొంగలనాయకుఁడగు ఆ మారఁడే యొక కన్యకామణిని మూపునఁ బెట్టుకొని, గుడికి మేకపోతుం దీసికొనిపోవునట్లు గొంపోవు చున్నాఁడు, నేఁడు నా కత్తికిఁ బనితగిలినది. ఇక్కడ ఆలస్యము సేయక పోయి ఆ దుర్మార్గుఁ డా బాలిక నెందులకుఁ దీసికొనిపోవుచున్నాఁడో ఎక్కడకు వెళ్ళుచున్నాఁడో తెలిసికొనెదను. (నిష్క్రమించును)

(తెర వ్రాలును)

## మహాడవరంగము కాళికాలయము

(ప్రవేశము మారఁడు తారచాటున విజయసింహుఁడు)

మార :— పిల్లా! ఏందు కేడుస్తావు. మొక్కుకో. కాళికా అమ్మోరికి కడసారి మొక్కుకో. నిన్నెలాగ బలియ్యకమానను.

తార :- (ఏడ్చుచు) హా భగవంతుఁడా! అనపరాధినగు నన్నిట్లు దుఃఖపెట్టుట న్యాయమా? నేను దుస్సీలనుగానే! అసత్యము లాడలేదే! అన్యాయము లొనరింపలేదే! నధర్మములు సేయలేదే! అన్నపున్నెము లెఱుఁగనే! లోకవృత్తమును గ్రహింపలేదే! అమాయకురాలినే! తండ్రీ! నన్నింత కష్టపెట్టనేల? తల్లిదండ్రులులేని బిక్కిం జేసితివి. ఏకైక సోదరుండగు కనకసింహుని పీడఁజేసితివి, అతిభయంకరుడైన దొంగలరేనిచేతిలోఁ బడవైచితివి ఇన్నిదినములవఱకుఁ జెఱ యందుంచిరి ఇంకనూ కశదీరలేదా? ఇంకను నీకు సంతృప్తి కలుగ లేదా? నా చావునుగూడఁ జూచి సంతోషింపఁదలఁచితివా? అట్లయిన నాకు సహజమరణముం గల్పించి నాకు నీ సాన్నిద్య మొసంగరాదా? ఈ కటికకత్తితో గుత్తుకను గోయింపనేల?

విజయ :—(తనలో) ఏమి? ఈమె మాటలంబట్టి చూడగా ఉదయసేనుని పుత్రికయగు తారవలె నున్నది? ఇంచుకసేపు తాళెదను, సమయముఁజూచి యీ దస్యుని కంఠము నెగురవేసెదను.

మార :—ఎందు కేడుస్తావు పిల్లా! నీకు సావుతప్పదు. నేనెన్నో రోజులకాడ్నుంచీ, మా కాళికామ్మోరిని పత్తేచ్చిగం సేసికోవాలని

కోర్తుంటాను. కన్నెపిల్లను బలిత్తేనేగాని, పతేచ్చిగంకానంది. దొరక్క దొరక్క నాకు దొరికినావు నిన్నొగ్గితానా ఒగ్గను కనుక కడసారి మొక్కుకొని సావుతప్పనప్పు డేడుపెందుకు ?

తార :—తల్లీ ! కాళీ !

గీ. ప్రతిదినంబు దినుచున్న ♦ పశుగణంబు
చాలదంచుఁ దలంచితే ♦ స్వాంతమందు
ఆర్తనగు నన్ను రక్షింప ♦ మానియిట్టు
లకట ! భుజియింపఁజూచెదే ♦ అంగదడఁగ !

తల్లీ ! పరాశక్తివగు నీకే యిట్టి పాడుబుద్ధి పుట్టినదా ? దీనరక్షణము నీకు దూరమైనదా ? దుష్టశిక్షణ మహితమైనదా ? (మారని కాళ్ళపైఁబడి) తండ్రీ ! నన్నేల నిష్కారణముగ నఘంపఁజూచెదవు ? నేను నీ కొమరితవంటిదానను గానా ?

మార :—నాతో మాటాడొద్దు. కత్తినూరుకొని యీ లోపున అమ్మోరికి మొక్కుకో- లేకపోతే మానీ ! (అని కత్తిని నూరుచున్నాడు)

విజయ :— (తనలో) నా కిదే సమయము ఇపుడీ దుర్మార్గుఁడు పారిపోఁజాలఁడు.

తార :—హా దైవమా ! నన్ను రక్షింపవా ! ఓ సూర్యచంద్రులారా ! ఓ భూతములారా ! ఓ అష్టదిక్పాలకులారా ! మీరయిన నాకీ భయంకర మరణముం దప్పింపుఁడు !

విజయ :—అమ్మా ! భయపడకుము నిన్ను రక్షింప వచ్చుచున్నాఁడు అని ముందుకు లంఘించి మారని తలం దెగవేయును. మారఁడు క్రిందఁబడి కిలకిలఁ గొట్టుకొనుచుండును)

విజయ :—చావుము దుర్మార్గుఁడా ! నీ వొనర్చిన దుష్కార్యముల కిదియే ఫలము

తార :—ఓ మహాత్మా !

గీ. యక్షుఁడవో ! సిద్ధుఁడవో ! లేక ♦ అమరుండవో, స
మయమునకు వచ్చి నా పంచ ♦ ప్రాణములను

రక్షణము సేసితివిగాదె? ♦ రమ్యగుణుఁడ!
ఎటులఁదీర్తును నీ ఋణ ♦ మేను చెపుమ!

(అని వానిపాదములపైఁ బడును)

విజయ :—బిడ్డా! లెమ్ము నగవకుము నేను నీవు తలంచినట్లు మానవమాత్రుఁడనే! విజయసింహుఁడను భూపాలుండను.

తార :—(ఆశ్చర్యముతో) ఏమి? నీవు నా జనకుఁడగు ఉదయసేనభూపతికి ప్రాణమిత్రుఁడగు విజయసేనుండవా? హా తండ్రీ (అని పాదములపైఁబడును)

విజయ :—(తనలో) నా యూహ నిజమైనది. (పుత్రీ! ఏలవిచారింతువు. దుఃఖమందకుము. ఖలుండగు క్రూరసేనుఁడు నీ జనకుని హతగావించినాఁడని విని ససైన్యముతో నా దురాత్ముని దండించు టకై బయలుదేరితిని ఈ యరణ్యముగుండ ప్రయాణముచేయుచునొక నాఁడు అమాత్యసమేతుండనై సశీఘ్రముగుటచే ప్రయాణము సేయునొక వృక్షచ్ఛాయను విశ్రమించితిని రాత్రికరిని నిన్ను గొనవచ్చిన ఈ నన్యుఁడే నా మంత్రిం జంపి, నాకు మత్తుమందిచ్చి నన్నుఁ జెఱంబెట్టె నాఁడు ఈ దినమునఁ గావలివారలగ్రసను మోసపుచ్చి బందిం దప్పించు కొంటిని నిన్ని మూఁడు గొనివచ్చుటచూచి నేనిక్కడకు వచ్చి చాటున నిలువఁబడి వినుచుంటిని అమ్మా ఇది నా వృత్తాంతము.

తార :—(కన్నీరుగార్చుచు) ఆహా! విజయసింహభూపాలా! మిత్రవాత్సల్యముచేతి నెట్టిచిక్కులకు లోనయితివి?

విజయ :—కుమారీ! నీ జనని యేమయినది? సోదరుఁడు కనక సింహుఁడేడి? నీవి దుర్మార్గున కెట్లు వశమయితివి?

తార :—(దుఃఖించుచు) అయ్యో! తండ్రీ! ఏమని చెప్పుదును ఖలుఁడగు క్రూరసేనుఁడు మా తల్లిం బలాత్కరింపఁబోవఁగా—ఆ మహాసాధ్వి సముద్రములోఁ బడినది. మమ్ముల నిరువురను దన యను చరులచేఁ జంప నొక యరణ్యమునకుఁ బంపినాఁడు. భగవదనుగ్రహ

ము చేత, ఆ క్రూర సేనుని యనుచరులలో నొకఁడు మా యందుఁ గని కరించి మమ్ములను జంపక విడిచిపెట్టినాఁడు. అంత నేనును సోదరుండును అరణ్యమునబడి పోవుచుంటిమి. నేను దుర్భరంబగు దాహపీడచే నేలబడి మూర్ఛిల్లితిని. అపుడు సోదరుఁడు కనకసింహుఁడు జలమును గొని తెచ్చుటకుఁ బోయినాఁడు పిమ్మట ఏమయినదో నే నెఱుంగను. నాకు స్పృహవచ్చునటికి నేనొక చెఱయందుంటిని. ఈ దినమున నిపుడు నీచే హతుఁడైన యీ వస్యుఁడు నన్నుఁ గాళికాదేవికి బలియిచ్చెదనని తీసికొని వచ్చినాఁడు పిమ్మట నీ వెఱింగిన విషయమే? (కొంచెమాగి) తండ్రీ! నా సోదరుఁడు కనకసింహుఁ డేమాయెనో కదా!

విజయ:—అమ్మా! నీవు విచారింపవలదు చీఁకటిపడుచున్నది రమ్ము. మనమీ యరణ్యముం దాఁటిపోవుదము. కొలఁది రోజులలోనే మనము పురముం జేరఁగలము. పిమ్మటఁ జారులను బంపి నీ సోదరు జాడలం దెలిసికొనవచ్చును. (ఇరువురు నిష్క్రమింతురు, తెరపడును)

## నాలగవ రంగము వీరసింగు లోగిలి

(ప్రవేశము వీరసింగు రెండవభార్య కుముదాబాయి)

కుముద:—(తనలో) లోకములో సవతిపోరుపడుట కష్టము గదా! ఎక్కడనో, అరణ్యములో పెద్దపులి చంపుచున్న యువతిని మా నాథుఁడు రక్షించి వెంటఁబెట్టుకొని యింటికిఁ దీసికొనివచ్చినాఁ డుఆమె యప్పటినుండి మా యింటనే యున్నది. కాని అదియేమిచిత్రమో ఈమె యెల్లప్పుడు నా సవతియగు రాధాబాయిపక్షముననే మాటలాడుచుండును. ఆమెబిడ్డల నెక్కుడు ముద్దుగాఁ జూచును. నేఁటితో నేను చేసిన పనిమూలమున నిఁక నా సవతికి బిడ్డఁడేఁడీ! పాలలో విషముగల్పి యా బుడుతనికిఁ ద్రాగుమని యిచ్చితిని. అతఁ డది త్రాగినాఁడు అప్పుడే చచ్చినాఁడు. నేరము నామీఁదఁ బడకుండ మాయింట నున్న ఆ యువతియే బాలునిం జంపినదని భర్తతోఁ జెప్పితిని; కృత్రిమముగా నేడ్చితిని. ఉపాయమున్నచో సాధింపంరాని కార్య మేమున్నది

(తెరలో కలకలము)

(ప్రక్కకుఁజూచి) సెబాస్ ! నాది తెలివి నాది యుక్తి. నేను చేసిన నేరమున కామెను రాజభటులు గొనిపోవుచున్నారుఁ ఏదో యించుక పుణ్యముచేసినది. అందుచేతనే వాఁడు పెద్దపులినోటిలోఁబడి చచ్చుచుండ నేటివరకు బ్రతికినది నేఁడు నేనుచేసిన నేర మీమెమీఁద మోపబడుటవలన మరణదండన ఈమెకుఁ దప్పదు. ఇఁక నేను పోయె దను. సాక్ష్యమీయవలసియుండునేమో! (నిష్క్రమించును, తెరపడును)

చతుర్థాంకము—సంపూర్ణము.

---



# కనకతార

## పంచమాంకము

### మొదటి రంగము సభాస్థలి

(శౌరి యెత్తుగా సింహాసనమునఁ గనకసింహుఁడు—సువర్ణుఁడను మంత్రి—భటుడు—వీరసింగు—కమల—సముదాబాయి)

కనక :—సువర్ణా! ఈ ముప్పురికి సంబంధించిన నేరములో మనభటుని ముందు విచారింపుము.

సువ :—భటుఁడా! నీకీ శిశుహత్యానేర సందర్భమున తెలిసినంతవరకు జెప్పుము.

భటు :—మహాప్రభూ నేను వీథింబడి పోవుచుండఁగా వీరసింగు గారి భవనములో గందరగోళ ముదయించినది అదేమైయుండునాయని నేను పోయితిని. అంత వారు తమ పెద్దభార్య పుత్రునకుఁ దమ యింటిలోనున్న యీయామె విషమిచ్చి చంపినదని చెప్పిరి అని (కమలం జూపును) తోడనే నామెను బంధించి తెచ్చి చెరసాలం బెట్టితిని; నేఁడు నేరమును విచారింపబూనుకొనుటచే సాక్ష్యమిచ్చుటకు వీరిని హాజరు పెట్టితిని ఇవియే నే నెఱింగిన సంగతులు

కనక :—(కమలం దేఱిపారఁజూచి తనలో) ఔరా! ఏమిది? ఈమెయందు మా తల్లియొక్క ప్రతిబింబము పొడసూపుచున్నది? ఆఁ! ఏమి నా వెర్రి ఒకరిని బోలినవారు వేఱొకరుండరాదా? నాఁడు సముద్రములోఁబడిన నేఁ డెక్కడనుండివచ్చును.

సువ :—వీరసింగూ! ఈ హత్యాసందర్భమున నీ వెఱింగినవిషయములను ప్రభువువారికిఁ దెలియజేయుము.

వీర :— ప్రభూ ! నా కిరువురు భార్యలు గలరు ! అందొకతె కుముదాబాయి. వేరొకతె రాధాబాయి. ఆ యిరువురకు బిడ్డలుగలరు ఒకనాఁడు నే నరణ్యమునకు వేటకై యేఁగితిని. (కమలం జూపుచు) అట నొక బెబ్బులి యీమెపై లంఘించె. తన పొట్టం బెట్టుకొనుచుండగా నేను కటారినఁ బోయి. దానిని మడియింపఁజేసి యీమెను రక్షించితిని. ఈమె తాను దిక్కుమాలినదాననని చెప్పుటచే నాఁడే నా వెంట నిడుకొని గృహమునకుఁ దీసికొనివచ్చి మాతృభావముతో నే కొఱంతయుఁ గలుగకుండ గౌరవించుచుంటిని. ఈమెయు మహాసాధ్వీమతల్లి వోలె వర్తించుచున్నది. కాని యీనాడు మా పాపమో-లేక ఆమెకీ యపకీర్తి బ్రహ్మ లలాటమున లిఖించినాఁడో తెలియదు ; కాని నా పెద్దభార్యయొక్క కుమారునకు విషమిచ్చి చంపినది.

కనక :— వీరసింగూ ! నీ వామె విషమిచ్చుట చూచితివా ?

కమ :—(తనలో) అహో ! ఏమిది ? ఈ కంఠస్వరము నాకుఁ జిరపరిచితమువలెనున్నదే ? (పరికించి చూచి) అన్నన్నా ! ఈతని మూర్తియందు నా కుమారుని చిహ్నములు పొడఁగట్టుచున్నవే

వీర :— మహాప్రభూ ! నే నసత్యమాడఁజాలను. ఈమె విషమిచ్చుటకు నేను చూడలేదు నా చిన్నభార్యయగు కుముదాబాయి నాతోఁ జెప్పినమాటనే నేను దేవరకు విన్నవించితిని

కనక :— నీ యభిప్రాయమేమి ? ఈమె యట్టి దుష్కార్యమాచరించినదని దలంతువా ?

వీర :— మహాత్మా ! నే నది యెట్లు చెప్పగలను ? ఆమె సద్వర్తనము నుబట్టిచూడఁగా నట్టి హత్యం జేసియుండదని నేనుమాత్రమే కాదు ఇరుగుపొరుగువారు కూడ విశ్వసింతురు.

కనక :— అమాత్యశేఖరా ! ఇఁక వీని రెండవ భార్యయగు కుముదాబాయిని విచారింపుము.

సుమ :— వీరసింగూ ! ఇఁక నీవు ప్రక్కకేఁగి, నీ రెండవభార్య నిటుఁ బ్రవేశపెట్టుము. (అతఁ డట్లు చేయును)

కనక :—అమ్మా! నీ సపతి కుమారుని హత్యనుగురించి నీకుఁ దెలిసిన యదార్థ మెఱిఁగింపుము

కుముద:—(గట్టిగా) ఈమెనా సవతి కుమారుని విషమిచ్చి చంపినది

కనక :—(తనలో) ఏమి? ఇంత దృఢముగాఁ జెప్పుచున్నది, నాకున్నసందలి కర్కశముం జూడఁగా, ఆ పాప సపత్నీమాత్సర్యముచే ఈమెయే చేసియుండునని శోఁచుచున్నది (కమలం బరిశీలించి) అక్కటా! ఈమెం గాంచినంతనే హృదయముం దాందోళన మొందవు చున్నది. నిక్కముగ నా తల్లివోలె నున్నది (ప్రకాశముగా) అమ్మా! నీవు నీ సవతిబిడ్డ కీమె విషమిచ్చుచుండగా చూచితివా?

కుముద :—చూచి-లేదు-ఆఁ! చూచితిని.

కనక :—నీ వసత్యమాడఁజూచినను, నీ నాలుక అసత్యభాషమగదా! (ప్రకాశముగా) అమ్మా! ఇఁక జాలును. నీ వేగుము. (మంత్రి నుద్దేశించి) సువర్ణా! నేరస్థురాలనబడు నామెను బిలువుము.

కమ :—(ముందునకొచ్చి నిలువఁబడెను)

కనక :—అమ్మా! నీపై మోపఁబడిన యీ నేరమునకు నీవు ప్రత్యుత్తర మేమి చెప్పెదవు?

కమ :—(తనలో) "అమ్మా" యనుటతోడనే కనకసేనుడని పించి నా డీతఁడు హృదయమా! తొందరపడకుము (ప్రకాశముగా, అయ్యా! నే నేమియుఁ జెప్పవలచుకొనలేదు మీ చిత్తము వచ్చినట్లు చేయుఁడు.

(అపుడు వైద్యుఁడొక బాలునితో బ్రవేశము)

వైద్యు :—మహాప్రభూ! ఈ హత్యాసందర్భమునందు తగిన సాక్ష్యమిచ్చుటకు వచ్చితిని. నేనొక వైద్యుఁడను.

(అందఱు దెల్లబోయి చూతురు)

కనక : – నీకుఁ దెలిసిన సత్యమెఱిఁగింపుము.

వైద్యు :— మహారాజా! ఈతఁడే విషమీయఁబడిన బాలుఁడు

వీర :—హా కుమారా! తండ్రీ! బ్రతికితివా! (కౌగలించుకొనును.)

కనక :—(ఆశ్చర్యముతో) ఎట్లు బ్రతికినాఁడు ?

వైద్యు :—ప్రభూ! వీనిని చికిత్సార్థమై నా యొద్దకుఁ బంపగా నేను తగిన మందొసఁగి విషముం గ్రక్కించితిని. విచారణార్థమై వీరెల్లరు నిటకుఁ గొనిరాబడుటచే, పశ్చాత్తాపము నీ బాలునివలననే తెలిసికొని నిర్దోషిని రక్షించుటకై త్వరణమున కిటు వచ్చితిని

కనక :—ఎవరు నిర్దోషి ?

వైద్యు :—ప్రభువువారీ బాలునివలననే తెలిసికొనుఁడు.

కనక :—అబ్బాయీ! నీకు విషమిచ్చినది యెవరు ?

బాలు :—మా పిన్ని పాలలోఁ గలిపి త్రాగుమన్నది త్రాగుట తోడనే కన్నులు తిరిగినవి క్రిందబడితిని.

కనక :—సువర్ణా! శిశుహత్యం జేయుటకుఁ బూనుటయేగాక తా జేసిన నేరము నన్యులపై నారోపించుచుండుటచే ఈమె వధ్యురాలు అధికారపత్రము ను వ్రాసియిచ్చి •దండనాధికారియొద్దకు భటునితో నీమెను వధ్యస్థానమునకుఁ బంపుము

సువర్ణుఁ డట్లు చేయుగా భటుఁడు కుముదాభాయిని దోడ్కొని పోవును వీరసింగుకుమారు నెత్తుకొని పోవును.

కనక :—(తనలో) ఈమె తప్పక నా తల్లియే! సందేహము లేదు తన కథం చెప్పుమని ప్రశ్నించెదగాక [ప్రకాశముగా] అమ్మా నీ వృత్తాంత మెఱిఁగింపుము.

కమ :—అయ్యా! నన్నేల పలుమారులు నొక్కించి యడుగు చురు ? నే నొక నిర్భాగ్యురాలును అనాధను ? అం చెప్పినజాలదా!

కనక :—[ఆతృతుతో] అమ్మా! చెప్పుము సందేహింపకుము వెనుదీయకుము నీ చరిత్ర సర్వము చెప్పుము ?

కమ :—[తనలో ఏమి ? నా గాధను వినుట కింత కుతూహాల పడుచున్నాఁడు ఈతఁడు నేను తలంచినట్లు నా బిడ్డఁడా! ఏమ యిన జెప్పుటయే మంచిది [ప్రకాశముగా]

సీ. మాఅది క్రూరుండయి ♦ మగని వధియింప
సనదన్నై తిపి నేను ♦ వినుమీ గురుడ !
ఆత్మపాతివ్రత్య ♦ మంత మొందింపగా
దుర్మార్గుడా వాడు ♦ తొడరినంత
సహాయింపఁజాలక ♦ గహనసీమునఁ జొచ్చి
పలువిధకష్టముల్ ♦ బడితి నేను
బిడ్డల నిపు్వరు ♦ విధివశంబునఁ గోలు
పోయితి నీరీతిఁ ♦ బుడమియందు
గీ. బ్రతికియున్నాను జీవచ్ఛ ♦ వంబనగుచు ;
దిక్కు లేనయ్యడనునాకు ♦ కనురాల ;
వంత మెండుగ నుండె నా ♦ స్వాంతమందు ;
ఏల వినఁగోరెదవు నాదు జాలికతను ?

కనక :—[చటాలు లేచిపోయి యామెం గౌఁగలించుకొని] హా తల్లీ !

కమల :–[కౌఁగలించుకొని] హా కనకసేనా ! తండ్రీ ! నీవేనా!

[తెర పడును]

## రెండవ రంగము

[ప్రవేశము భటుఁడు]

భటు :—కనకసేనమహారాజుగారు ససైన్యయుతులై తన పిన తండ్రియగు క్రూరసేనునిమీఁదికి యుద్ధమునకు వెళ్ళిరి. ఈ యుద్ధ మెన్నిదినములకు ముగియునో ! తిరిగి మహారాజెప్పు డిటకు వచ్చునో ! [పరిక్కించుఁ జూచి] ఆ వచ్చువా రెవ్వరుచెప్పుమా ? ఒక బాలికయు నొక పురుషుఁడును ! [పరికించి] ఏమిది ? ఏమిది ? అహో ! ఎన్న దినములకు ? మహారాజుగారు విజయసింహులే ! నాఁడు జాడ లేకుండఁ బోయిన మా ప్రభువు లే !

[అపుడు తారాసమేతుఁడై విజయసింహుఁడు ప్రవేశము]

భటు :–జయము జయము మహారాజగారికి [నమస్కరించును]

విజయ :—ఓరీ ! విశేషములేమి ?

భటు :—మహాప్రభూ ! నాడు మీరు క్రూరసేనునిమూదికి జాడివెడలుచు మార్గములో దప్పిపోయినారు. చాలదినములవరకు మీ జాడ దెలిసికొనుటకు విశ్వప్రయత్నము గావించినాను. లాభము లేక పోయినది. చివరకు మహామంత్రిగారు పురోహితులవారి యాజ్ఞానుసారము సింహాద్వారమున దుర్గలో నిర్మించిరి అద్దానిం దటిపి లోనఁ ప్రవేశించుచు రిని రాజుగాఁ జేయ నూహించిరి కొన్నిదినంబులకు మీ మిత్రులగు దివంగతులైన ఉదయసేన భూపాలకు పుత్రులగు కనక సింహులిందుఁ బ్రవేశింపగలిగిరి నాఁటినుండి వారే రాజయి పరిపాల పాలనాదికము నిర్వహించుచున్నారు.

విజయ :—(ఆశ్చర్యానందములతో) ఏమీ ? కనక సింహుఁడా? కుమారీ ! తారా ! రమ్మి మీ సోదరుడిక్కడనే యున్నాడు.

భటు :—మహాప్రభూ ! కనకసింహులవారు ప్రస్తుతము నగరున లేరు. నిన్ననే ససైన్యముగఁ గ్రూరసేనునిమీఁదకు దండెత్తిపోయిరి. దైవికముగా వారిమధ్యఁ దమతల్లిగారినిఁగూడ గనిసికొనినారు.

తార :— (సంతోషముతో) తల్లిగారు ? తల్లిగారు ?

భటు :—అవును వారు కూడఁ గుమారునితో నేఁగినారు ఎల్లప్పుడు నా సాధ్వి 'తారా ! తారా !' అని విలపించుచున్నారు.

తార :—తండ్రీ ! నాకు జననినిఁ సోదరుని జూడవలెననియున్నది

విజయ :—(భటునితో) ఓరీ ! నీ వేఁగి రథ మాయత్తపరపుమని సారథితోఁ జెప్పుము అమ్మా ! తారా ! మనమిప్పుడే యక్కడికేఁగుదము క్రూరసేనుఁ డతిదుర్మార్గుఁడు వానితోడి యుద్ధములో గనకునకుఁ దోడ్పడుటవసరము రమ్ము నగరులోనికిఁ బోయి తగుసన్నాహము లొనరించుకొందుము (అందరు నిష్క్రమింతురు)

## మహాడవరంగము యుద్ధభూమి

(ప్రవేశము కనకసింహుఁడు, కమల, క్రూరసేనుఁడు)

కనక :—ఓరోరి దురాత్మా ! క్రూరసేనా! నేఁటితో నీ కాయుః

ప్రమాణము ప్రాప్తియైయున్నది.

చ. జనకుని హాస్యముఁ జేసితివి ♦ సాహసమంచుఁ దలంపకుండ నా
జననిని బొంకఁజేసితివి ♦ చంపఁగ నెంచితి మమ్ము బిడ్డలన్
నుసఁగలవాఁడ వేయిఁక న ♦ మానుషకృత్యములాచరించుచున్
జనితానపినన్నుఁ గాలుని పు ♦ రంబున కిప్పుడె దుర్మదాంధుడా!

క్రూర :—(అట్టహాసము నొనరించుచు) ఓరీ! నీచేత వధింపఁబడు వీరపాల శూరపాలురనుకొంటివా? పరాక్రమధనుండనగు క్రూరసేనుండను నేను నాతోడి యుద్ధమునకు సన్నద్ధుఁడవగుచున్నావా?

ఉ. దంచెదఁ బిండిపిండినను ♦ దగ్ధము సేయుచు నీదు దేహమున్
పంచెద గాకముఖ్యకులకు ♦ పానము సేయుదు నీదు రక్తమున్
వంచెద నీదు వెన్నెముక ♦ వ్రాటును వేయుదు వేల? వెంటనే
అంచితశౌర్యమేర్పడఁగ ♦ నాజమునందునఁ దాకుమానవుల్.

కనక : ఓరీ! తుచ్ఛుఁడా! నీతోఁ బోరొనరించి నిన్ను యమపురి కనుపుటకే నేను సకలసేనాసమేతంబుగ నిటు వచ్చితిని నీ యాశ్రితులు సుపులందొఱిగిరి నీ సైన్యము నశించినది ఏకాకివై నీ వొక్కరుండవు మిగిలితివి రమ్ము, వీరపాల శూరపాలుర సహాయార్థమై నిన్నుఁగూడ బంపెదను. (ఇరువురు యుద్ధముసేయుదురు)

కమ :—పరమేశ్వరా! తండ్రీ!

గీ. ధర్మము జయించునను మాటె ♦ సత్యమేని
పతిని ప్రతిమగఁ దలచిన ♦ పడతినేని,
కలుషమెఱుఁగక చరియించు ♦ కాంతనేని,
జయమొసంగుము; సుతునకు ♦ సంగరమున.

(నే పథ్యమున)

" ఉ. ఆలము సేయుచుంటి వెవురా! కనకాహ్వయయోధ
బాలుఁడు యుద్ధనైపుణిని బాగుగఁ బొందఁడు, నీదుశౌర్యమున్
లేల హరింప వచ్చితిని లెమ్ము; బలమున నన్నుఁ దాఁకుమా!
కాలుని ప్రోలి కంపెదను గౌతుక మొప్పఁగ క్రూరసేనుఁడా!"

కమ :—ఆ మహానుభావుఁ డెవ్వఁడు?

(విజయసింహుఁడు తారతోఁగూడ ప్రవేశము)

తార :—హా తల్లీ! ఎన్నిదినములకు నిన్నుఁ జూచితిని ?

కమ :-హా తారా! సుఖముగ నుంటివా? (కౌఁగలించుకొనుచు)

విజయ :—అమ్మా! కమలా! సుఖముగ నుంటివా ?

కమ :—తండ్రీ! విజయసింహమహారాజా! నా యవజ్ఞను మన్నింపుము పుత్రికావాత్సల్యమున నిన్ను మున్ముందు బలుకరింపక పోయితిని.

విజయ :—మనము పిమ్మట సావకాశముగా మాటలాడుకొన వచ్చును. యుద్ధరంగమునందుఁ గనకునకుఁ దోడ్పడు టవసరము కనక పిండా నీవు తప్పుకొనుము నేనా కూ్రరుని మచ్చమూపెదను.

కనక : (కూ్రరుని నిరాయుధునిగాఁ జేసి పాపిమీఁదికి లంఘించి)

తుచ్ఛుడా! ఇపు డెక్కడికి కేగెదవు ? (అని త్తిని గుండెకు గురిసేయుచు) నీవు చిటికాలములో భూలోకమును విడిపోవుదువు. అంత్యమునందైనఁ జేసిన దుండగములకుఁ బశ్చాత్తాపము పొందుము.

సీ. విదిత్రుండై యుండ ♦ నేతయా నా తండ్రిఁ
గదిసిచంపుటను నీ ♦ కిది ఫలంబు!
సాధ్వియా నా తల్లి ♦ సాహసంబు బొంద
నేచినందులకు నీ ♦ కిది ఫలంబు!
పసిబిడ్డలగునుమ్ము ♦ వధియింపఁగానేల
కేఁగ జేయుటను నీ ♦ కిది ఫలంబు!
మంత్రి సేనాని ♦ మరణమొందించి పొం
దిన సంతసమునకు ♦ కిది ఫలంబు!

గీ. ముదితలను గోరినందుల ♦ కిది ఫలంబు!
హేయముగ బ్రతుకుటను నీ ♦ కిది ఫలంబు!
హీనకార్యముల్ సేయుట ♦ కిది ఫలంబు!
తుదకు యమపురిజొచ్చుటే ♦ తుది ఫలంబు!!

(అని కత్తితోఁ బొడుచును. కూ్రరసేనుఁడు హాహాకారము

లోనరించుచుఁ గిలకిల తనున్నకొని చచ్చును. జయభేరులు మ్రోగుచుం డగా తెర వ్రాలును)

## నాల్గవరంగము-సభాస్థలి

(యథోచితముగ కనకసింహుఁడు, విజయసింహుఁడు, కమల, తార, తక్కుంగల అనుచరులు ప్రవేశము)

విజయ :—నాయనా! కనకసింహా! క్రూరసేనుని గతించి నాఁడు. పైతృకమగు రాజ్యమున కభిషిక్తుఁడవైతివి ఏతత్కార్యమునం దర్భమునఁ బౌరులను, పురోహితులను, మంత్రులను సేనానులను, సామంతులను వారివారి అర్హతల ననుసరించి సత్కరించితివి ఇఁక గావలసిన దేమున్నది

కనక :—మహాత్మా! మీ మిత్రవాత్సల్యమును నే నేమని కొనియాడఁగలను. మీరు మా తండ్రియందుగల యభిమానముచే మమ్ములను సర్వవిధములఁగ రక్షించితిరి కష్టములు అలముకొనినపు డెంతత్వరితముఁ బూనిననో—నేఁడు మాయమగునపుడుకూడ నంత త్వరితగతినే పట్టినవి సాధ్వీమతల్లియగు తల్లిని దర్శింపఁగంటిని. నాఁ డరణ్యములో దప్పిపోయిన తారను జూడగల్గితిని క్రూరుఁడగు గూరు నకుఁ బ్రతికారమొనరింపఁగల్గితిని జనకుఁ డధిష్ఠించిన సింహాసనము నధిష్టించితిని. ఇదియంతయు మీ దయచేతనేకదా! ఇఁక నాకుఁగావల సిన దేమున్నది? అయిన నిట్లగుఁగాక!

గీ. ఎన్నటికినైన ధర్మంబె ♦ వృద్ధిపొంది,
ప్రజలు ధర్మాభిలాషులై ♦ పరగుఁగాక!
జార చోరులు నీతి వి ♦ మూరులెందు
నుర్వి నడుగంటి రూపుమా ♦ యుదురుగాక!

అందరు :—తథాస్తు! తథాస్తు!! తథాస్తు!!! (తెర వ్రాలును)

పంచమాంకము—సంపూర్ణము.

# అనుబంధము

## మొదటి రంగము: కనకసేనుని సభాస్థలి

(తెర యెత్తగాఁ గమల, తార, కనకసేనుఁడు, విజయ

సింహుఁడు ప్రవేశము)

కమ :—తండ్రీ! విజయసింహమహారాజా! మీ కరుణాకటాక్ష వీక్షణంబున మా కష్టములు గట్టెక్కినవి.

సీ. క్రూరుండు చోరుండు • జారుండునౌ వాఁడు
పాపఫలంబును • బడసినాఁడు;
కనకసేనుఁడు తండ్రి • గారి సింహాసనం
బున వెల్గుచున్నాఁడు • మోదమొప్ప;
ననుఁగాన కొంటిగా • నలఁ గష్టమందిన
తార యీనాఁడు • నా అండనుండె;
పైతృకరాజ్య సం • త్ప్రాలనా గౌరవం
బొనగూర్చుటను సుతుం • డుత్తముండు;
గీ. రాజశేఖర! నేఁడు మా • కోజఁగలిగె
దీనరక్షకుఁడైన యా • దేవదేవు
డెదఁ బ్రవేశించి మీచేత • నెల్లకార్య
ములను జేయించినాఁడు క • ష్టములనుదోలి.

---

* "తనకతారా" నాటకముతోఁ బ్రధానులు తారా కనక సేనులగుటచేత, ఈ నాటకము సుఖాంతమగుటచేతను, మే మిందను బంధముగా నా యిరువురి వివాహ కథాభాగమును బొందుపఱచితిమి. ప్రదర్శకులు తమ వీలుననుసరించి యిష్టానుసారముగా నీ భాగమునుప యోగించుకొనవచ్చును.

విజయ :—అమ్మా ! నీవు నన్నింతగాఁ బొగడనేల ? ఇంతకు నే నొనరించిన ఘనకార్య మేమున్నది ? సర్వము భగవదిచ్ఛ ! కష్టములు మూడుటకు గాని సుఖములు చేకూరుటకుఁగాని మనుష్యప్రమేయము లేదు. ఒకప్పుడు లోకబాంధవుండు, సర్వభూత సన్మిత్రుండు నగు సూర్యుండు సర్వజనులచేత గర్హింపఁబడును. అందులకుఁ గారణము—కాలచక్రపర్యటనము గదా తల్లీ ! అదేవిధముగఁ గాల మొంతి లేసి మూర్ఖులను ఘనఁ గొని తెచ్చును. నేఁడు హంసతూలికాతల్పమున శయనించు భోగిని రేపు కటిక రానేల నుంచఁజేయును. నేఁడు తిరిపె మెత్తుకొని జీవించు నిర్భాగ్యుని రేపు దూరీకృత పురందర మహావైభవోపేతుం గావించి, వానిచేఁ జతుస్సముద్రముద్రితంబగు ధరణీమండలంబును శాసింపఁజేయును. కాలవిభ్రమణముచేతనే, ఎండకన్నెఱుఁగక శుద్ధాంతఃపురంబులలోఁ జెలికత్తెలనడుమ సంచరించిన మహారాజ్ఞి వగు నీవు—కానలఁబడి యిడుములు గుడిచితివి. ఇపుడా దుష్కాలము గతించినది. మబ్బువిడిచిన చందమున నీ కష్టములన్నియుఁ గడ తేరినవి భగవంతుని యక్షీణకృపాకటాక్షవీక్షణ పరంపరలచే నీ సుతుండు రాజ్యాభిషిక్తుఁడాయెను. వానికి వివాహం బొనరించి, ఏతన్మహోత్సవంబును గన్నులారఁ గాంచుటకన్నా నీకుఁ గావలసిన దేమున్నది ?

కమ :—రాజేంద్రా ! ఇన్నిచేసినవాఁడ నా కార్యముమాత్రము చేయక, మిన్నకుందువా ?

తార :—అమ్మా ! నాయనగారు సజీవులైయున్నపుడు, అనేక పర్యాయములు—“ విజయసింహమహారాజా ! మాకు మీతో వియమందవలయునను నభిలాషగలదని పలుకుచుండఁగా నేనువినియుంటిని

కమ :- అవును—వాస్తవమే ! అనన్యసౌందర్య తేజోలావణ్యరాశియు, నిరుపమ విద్యావతియు సద్గుణఖనియు విశేషించి యుక్తవయస్కయునగు బాలికారత్న మొండు విజయసింహమహారాజునకున్నది ఆమెనే కనకసేనునకిచ్చి పెండ్లిచేయుటకు వారూహించెడివారు

విజయ:— అమ్మా! నా ప్రతికను గోడలుగాఁ బరిగ్రహించుటకు నీకును, భార్యగాఁ జేకొనుటకు నీ సుతునకును, అంగీకారమైన యభ్యంతర మింకేదు: సరికదా, నిర్భరానందము జెందమున సంతసిల్లును

కమ:— అయిన నింక నేమి? వెతుకబోయిన తీవ కాలికిఁ దగిలినట్లు మీ యభిప్రాయ మెఱుంగవలె ననుకొనుచుండ మీ యంత మీరే మాకుఁ దోడ్పాటు నొసంగుచున్నారు... కనకా! ఇందులకు నీ వేమందువు?

కనక:— అమ్మా! అనుట కేమున్నది? స్వర్గస్థులగు తండ్రిగారికి విజయసింహమహారాజు వామభుజప్రాయుఁడు. వారిరువురి స్నేహమును ముట్టడించుట కాదిశేషుఁడుగూడ సమర్థుఁడుకాఁడు సార్థకనాముఁడగు క్రూరసేనుని దుండగములవలన వారు మనలను విడిచినది మొదలు విజయసింహమహారాజే మనపాలిటి భగవంతుఁడై, వారు లేని కొఱంతి యావంతయు లేకుండ సర్వకార్యంబులు సఫలీకృతంబులగునట్లు నిర్వహించుచున్నాఁడు. అట్టియెడ నమ్మహాత్ముఁ డవ్యాజానురాగముతోఁ దనకు దాన సుతను నాకిచ్చి పరిణయం బొనరింప గోరుచోఁ నే నేమందును? సిగిరా మోకాలొడ్డుదునా?

కమ:— విజయసింహమహారాజా! వింటివా కుమారునిమాటలు

విజయ:— అమ్మా! నేను ధన్యుండనయితిని. మన రెండుకుటుంబములకు ననాదినుండియుఁ గల స్నేహభావము. నా ప్రాణమిత్రుండగు నుదయసేనమహారాజుగారియొక్క బలవన్మరణముతో నంతరించునని సంకోచించి యంతరంగమున వంతం జెందితిని కాని దైవకృపనయ్యది వియ్యముగా గూడ మారినది.

కమ:— అట్లయిన, నాయనా! కనకసేనా ఈ శుభకార్యమున కాలస్యమేల? "ఆలస్యా దమృతం విషమ్మ"ను సామెతగలదు. "శుభస్య శీఘ్రమ్మ"ను సూక్తి ననుసరించి వివాహయత్నము లొనరించుట నా యభిమతము.

కనక :—అమ్మా ! నీ యాజ్ఞను దలం దాల్చెదను. (విజయ సింహు నుద్దేశించి) రాజేంద్రా! భవదీయ పుత్రికారత్నము నొసంగి నాపై నీకుంగల యపారమగు ప్రేమను వెల్లడించుచున్నావు నా కిది సంతోషమే ? కాని పుత్రాత్ముండవగు నీకు కొనసాగింపవలసిన దింకొ క్కటి యున్నది.

విజయ :—అదియేమి ? తెలియజేసిన నా శక్తి కొలంది పాటు పడి దానినిగూడ నిర్వహించెదను.

కనక :—ఆర్యా! మీరెరుగు తెలియని దేమున్నది! మా తారకు కూడ సర్వవిధముల ననుకూలుండగు పురుషుని వెదకి పరిణయం బొన ర్చింపవలయును.

కమ :— నేను చెప్పందలచుకొన్న మాటను నా కుమారుండే చెప్పినాడు మహారాజా ! మా కుటుంబ సముద్ధరణమునకు బద్ధకంక ణుండవయిన నీవే యీ కార్యమునుగూడ నెరవేర్పవలయును. జరా భారము విశేషముగాం బైం బడకున్నను తీరని వెతలు హృదయము నింతదనుకం గలంచివైచుటచేత శుష్కభూతశరీర నయితిం గదా ! వాన రాకయు, ప్రాణము పోకయు నెవ్వరు చెప్పగలరు ? పరమేశ్వరుం డెప్పుడు దీనురాలనగు నన్నుం దన సాన్నిధ్యమునకుం బిలువనంపునో ! "జాతస్య మరణం ధ్రువమ్మ" నుటచేం జావెప్పటికయిన నున్నదే కదా ! కనుక నాకీ మేనం బ్రాణములుండగనే కుమారుని పెండ్లితోం బాటు కొమ రితయొక్క వివాహమునుగూడం దిలకించితినేని ధన్యన య్యెదను. నిశ్చింతతో జీవిత శేషముం గడపెదను.

విజయ :—అమ్మా ! నీ మనోగతాభిప్రాయ మెఱింగితిని. తదనుసారము తారకు దగిన వరుని వెదకెదను ప్రస్తుతము మనము లోనికి బోవుదమురండు.

కమ :—మంచిది. (అందరు నిష్క్రమింతురు, తెర ప్రాలును)

## రెండవ పరంగము కనకసేనుని నగరు

(ప్రవేశము —గిడ్డూఖాన్, మందపాలుఁడు)

మంద :—ఏమోయ్! సాహేబూ! ఏమిటి విశేషములు?

గిడ్డూ:—(కోపముతో) క్యారే? క్యాఁకు ల్యారే? సాహేబూ హంటావ్? మాకీ ముసల్మాన్‌కీ గిడ్డూఖాన్ బహదూర్‌కీ. నబాబ్ హని పిల్సఁమాని— సాహేబుసాహేబు హంటావ్?

మంద :—(గర్వించుకొనుచుఁ దనలో) ఈ దిక్కుమాలిన ముండ కొడుకున కూరంతి స్వాతిశయమున్నది వీనిని "సాహేబూ" యని పిలువరాదఁట! "నవాబుగారూ" అనవలెనఁట! (ప్రకాశముగా) ఓయీ సాహేబూ..... కాదు—కాదు—నబాబూ!

గిడ్డూ :—అచ్ఛా-అచ్ఛామాకీ నీకీ హలాగ పిల్వాలా నరే— హిప్డూ సఁగతి యేఁటో హడ్గు సెప్తాం.

మంద : కోటలో సందడి యెక్కువగానున్నది పురమంతయు జక్కగా నలంకరింపఁబడియున్నది ఏ వీథిలోఁ జూచినను విశాలములగు పందిళ్ళు వేసిరి రంభాస్తంభములనునిల్పి తోరణములతోఁ వాసం గైసేసిరి. ప్రతి గృహమును పసుపుకుంకుములతోఁ గలకలలాడుచున్నవి ఈ సంతోషమునకు గారణమేమి?

గి :—హారే హల్లా! మంధాపాలా! నీకీ నచ్చిన తల్లి తండ్రీ వెయ్యూ సంవత్సరాల్ తల్లికింపుల్‌గా తపం జపం గిపం సేసి నీకీ బుద్ధికీ తగీట్లుగా "మంద" నామం పెట్టేర్—హేంటీబే? హకాశంనుంఛీ దిగీపడ్డావోడిలాగ, హూళ్ళోని సంగాతుల్ హెర్గానివోడిలాగ, హల్లాగా హడ్గుతావ్? హీ మధ్యా యెక్డానచ్చావ్?

మంద :—(తనలో) ఈ తురకముండకొడుకు నోటికి వచ్చిన మచ్చు నఁబ్రేలుచుండును; నేను తిరిగి యేమయిన నన్నచో! వీని కూరంతకోపము వచ్చును? (ప్రకా) ఓయీ? సాహేబూ కాదు-కాదు-నబాబు! ఈ మధ్య నేనీ నగరములో లేను అందుచేతనే యీ సందడికిఁ గారణమేమని ప్రశ్నించుచున్నాను. (15)

గి :—హా రే ! హెక్కడికీ పోయావ్ ! యమలోకం నీకీ నచ్చిన తల్లికి తండ్రికి సూస్కుహుండడాన్కి పోయివుండావ్ ?

మంద :—వచ్చినావు లేదు యమలోకములో నీ కుద్యోగము సంపాదించుటకేఁగితిని.

గి :—(సంతోషముతో నగిరి గంతులిడుచు) అచ్ఛా-అచ్ఛా అరే భాయీ ! మాకీ యమలోకంలో బడాబడా హుద్యోగం దొర్కుతాదిబే ?

మంద :—ఓ , తప్పకుండా దొరకఁగలదు. ముందు నా ప్రశ్నమునకు సమాధానం చెప్పుము.

గి :—హాయితేహాన్కో మందపాల్ ! మన కన్కసేనమహారాజ్ గార్కి వార తండ్రీ హుదయసేనమహారాజుగారి స్నేహితుఁడు హుండాడ్ ? ...

మంద :—అవు నవును, విజయసింహ మహారాజు.

గి :—అచ్ఛా ! ఆ మహారాజ్కి హమ్మాయిసీ యిచ్చి పెండ్లి వారి కోటలో సేస్తార్ ! హందుకే హీ నగరంలోని పెద్దా పెద్దా హుద్యోగస్తుల్—సేనాధిపతుల్—మంత్రుల్ — వర్తకుల్—హందరు పయనమై పోతావుండార్ !

మంద :—ఆహా ! ఎంత సంతోషకరమైనవార్త ! సాహేబూ ! మన కనకసేనమహారాజుగారికి వివాహమని చెప్పి నాకు సంతోషము ఘటిల్ల జేసితివి

గి .—హారే మందపాల్ ! సచ్చామందపాల్ ! హీన్కో ! హొక్కటీ కాదు రెండు పెండ్లిండ్లు.

మంద :— ఎవరెవరికి ?

గి :—నీది మట్టిబుర్రబే, హెంత చెప్పిన తెల్దు ; మన మహారాజుగార్కి హప్పుహుండారు—తారాహమ్మ—ఆమెకు రెండో పెండ్లి

మంద :—ఓరి నీ తెలుగుమండా ఈ మాట నన్నే లెవరయిన విన్నచో నీ తలఁ ద్రెళ్ళనేసియుందురుఁ కనకసేనమహారాజుగారి వివా

హాయితోఁ గూడ దారకుఁగూడఁ బెంగ్లియా? ఆహా! నే డెంత సుదినము! శుభములుకూడఁ గష్టములవలె నొంటరిగా రావుగదా! గిడ్డూఖాన్ అనన్యసౌందర్య లావణ్యతేజోరాశియగు తారను బరిగ్రహించు క్షత్రియకుమారుఁ డెవ్వఁడో నీ వెరుంగుదువా?

గి :—పేర్గా కేమి! తెల్సు—మాకి హంతా తెల్సు...తారకి కాబోయే పెనిమిటి కల్యాణనగరం పాలించు కీర్తిమంతమహారాజ్ బడాహందా గాడ్. హో మహారాజుని నూడాలిహంటే దేడ్డు యిచ్చినా రెండుకళ్లూ చాలవు.

మంద :—గిడ్డూఖానూ! వివాహముహూర్త మెప్పుడు?

గి :—హారే—హెళ్ళుండిబే—హేనుగ్లు—గీనుగ్లు—గుర్రాలు—రథాలు హాస్తి హుడాయించేయి—కనకసేనమహారాజులుంగారు తమ హాప్పు తల్లితోకూడా మంత్రుల్ గింత్రుల్తోఁగూడా విజయసేనమహారాజులుంగారి! పట్టణాన్కి—హెళ్ళిపోయేర్

మంద :—గిడ్డూఖాన్! తారాకీర్తిమంతుల వివాహముకూడా నా పందిట్లోనే జరుగునా?

గి :—అచ్ఛా అగును. ఇంకా బాతాఖానీ కట్టిపెట్టు. మేం పారహుషార్ హుండం మాని కూకొని, కబుర్లు సెత్తగిస్తే హెవరయినా సూచీ మాకీమీద దెబ్బతీస్తార్!

మంద :—మంచిది. నాకు సెలవిమ్ము. నేనుగూడా మహారాజుగారి కల్యాణమహోత్సవము చూడబోయెదను

గి :—హెళ్ళా—హెళ్ళా—వచ్చేడప్పు మాకి నజారా గిజారా జాస్తీగా తీసికొనివచ్చి యియ్యి.

(మందపాలుఁడు నిష్క్రమించును, తెర పడును)

## మహాడవరంగము—కల్యాణమంటపము

(తెర యెత్తగా యథోచితవేషములతో సుశీలా కనకసేనులు తారాకీర్తిసుమంతులు,కమలవిజయసింహులు మున్నగువారు ప్రవేశము(

విజయ :— (స్త్రీ యొక్క హస్తమును బట్టుకొని) కుమారీ!

చ. పెరిగితి వింతకాలమును ♦ ప్రేమదలిర్పఁగ నా గృహంబునం
దరుగుచునుంటి నీ విపుడు ♦ నా కనతాహ్వయుపత్నివౌచు; నే
మరకుము మమ్ము నెల్లరను ♦ మానవమందున భక్తితోడ తన్
చరణములంటి మ్రొక్కి పతి ♦ సంసమొప్పగ సేవ జేయవే!

సీ. గతజీవుఁడైనట్టి ♦ కాంతుని బ్రతికించి
పేరుగొన్నట్టి సా ♦ విత్రిపోల్కి
కమలాసనాదులఁ ♦ గసుగందువను జేసి
స్తుతులు గాంచిన యన ♦ సూయమాడ్కి
పతిసీడఁబాయక ♦ వనమున నిక్కట్లు
పొందిన భూపుత్రి ♦ సీతనరసి
అతుల పాతివ్రత్య ♦ మాహాత్మ్యధనంబుగా
నలరిన దమయంతి ♦ ననుసరించి

గీ. భర్తృసేవకు మించిన ♦ భాగ్యమొండు
త్రిభువనంబుల లేదని ♦ తెలిసి సతతము
భర్తసేవించి సత్కీర్తిఁ ♦ బడయుమమ్మ!
సార్థకాహ్వయవౌదువు ♦ జగతిలోన.

పుత్రీ! అధిక విద్యావతివి; వినయవతివిసగు నీకు మేము వేఱుగా సత్ప్రవర్తన మలవడఁజేసికొమ్మని చెప్పనక్కరలేదు స్త్రీలకు పాతివ్రత్యమే భూషణము? పాతివ్రత్యమును మించినది వేఱొండు లేదు అద్దాని నలవడఁజేసికొన్న యింతు లెంతలెంత లేసి కార్యములనయిన సాధించిరి. హైందవ సుందరీమణుల సుపవిత్ర చారిత్రంబుల నీవు పఠించితివి వారిని వ్యాప్తినుగు కలిపి అత్తింట వన్నెకెక్కుము నీ భర్తయగు నీ కనకసేను డవ్యకపరాక్రమశాలి, రూపవిత మారుఁడు మహేంద్ర హీభవోపొతుండు-గుణదత్నాకరుఁడు-ఇట్టి వానిని భర్తగాఁ బడయుట కీవు పూర్వజన్మంబునఁ బుణ్యంబొనరించితివని నేను జేఱుగ

జెప్పనేల ? సుశీలా ! పుట్టినింటికిని, మెట్టినింటికిని సత్కీర్తి నార్జింపుము ......(కమలను నుద్దేశించి) అమ్మా ! కమలా ! నీవు సద్గుణములచేతను సత్ప్రవర్తనముచేతను శాంతముచేతను భూజాతయగు సీతవంటిదానవు. ఆనాఁడామె దుష్టుండగు రావణునిచే జెఱఁబెట్టఁబడి నాథుని బాసి యిక్కట్టుల దినది. ఈనాఁడు నీవు కథావశేషుఁడయిన కుమారుని వలన బాధ లనుభవించితివి. ఆమె దశకంఠుని బెదరింపులకు లొంగలేదు. నీవు మఱదియొక్క దౌష్ట్యమునకు గలంగలేక పాతివ్రత్య పరిపోషణామే ప్రాధికమని భావించితివి నీకే నా పుత్త్రి తన పూర్వజన్మసుకృతంబుచే గోడలయినది నీ శాంతమే యామెం గలుగొందునట్లును నీ సత్ప్రవర్తనమే యామె కలవడునట్లును జేయుభారము నీయది.

కమ :—ఆర్యా ! విజయసింహమహారాజా ! నీ విన్నివిధముల నాకు జెప్పనక్కరలేదు సూర్యునకు గాంతి నినుమడింపజేయు పదార్థమింకొకటిలేదు. సకలసద్గుణవతియగు నీ కొమరితకు నేను వేఱుగా సత్ప్రవర్తనము బోధింపనక్కరలేదు.

విజయ :—నాయనా ! కనకసింహా ! నాకు మగసంతులేదు గదా ! కొమరుండవయిన నల్లుండవయిన నీవొక్కరుఁడవే నా యేక పుత్రికను నీ చరణదాసిగ నర్పించుచున్నాను. ఆమె గోల తెలిసియో తెలియకో యొనరించు దోసంగుల రక్షించుభారము నీయది. నీకు నిన్నామెను సాదరణమున జూడుమని హెచ్చరించు టనుచితము.

కనక :—మహారాజా! కొమరుండనయిన నల్లుండనయిన నే నొక్కరుడనేగదా మీకు నాకు దండ్రియయిన మా యమ్మయయిన మీరొక్కరే? మీ పుత్రికను మీరు నన్నెట్టి ప్రేమభావముతో సాకుచుందురో, అట్టిభావముతోనే సాకుచుందును......ఇఁక గాలయాపన మెందులకు ? కాఁగల శుభకార్యములయినవి అపారమగు మీ కృపారసంబున మా తారకఁగూడ నృసింహమహారాజున కిచ్చి పరిణయము గావించితిరి ; నన్నొక యింటిపట్టున నుంచితిరి అజన్మాంతము నేను మీకు కృతజ్ఞుండను—కాలయాపన మెందులకు ? మా నగరమునఁ

బ్రిఃలాదరు మా రాకకొఱ కెదురుచూచుచుందురు. కనుక ప్రయాణ సన్నాహము లొనరించుకొనవలయును.

విజయ :—అటు నరండు. మనమా కార్యములను నెరవేర్చు కొందము. (అందరు నిష్క్రమింతురు, తెర పడును)

## నాల్గవరంగము-కనకసేనుని నగరు

(ప్రవేశము—గిడ్డూఖాన్)

గి :—(తనలో) అచ్ఛా! మా కీహీంయూశా బహూసంతోషం. విజయసేన్ మహారాజ్‌గారి హమ్మాయికీ పెండ్లిహాడి కనకసేన్ మహా రాజ్‌గాఱు వస్తూవుండార్. ప్రిజలుహాంకర్ పండ్గాబట్టల్ కట్టి మంగళ్ హాయిద్దాల్ హెంటూ బెట్టుకోని. హేనుగుల్ గుఱ్ఱాల్ కూడా తీసికొని హెదురుహేగినార్......(ప్రక్కకుఁ దిరిగి) అదిగో! మందాపాలుడు ప్రవేశించుచున్నాడు హాడిక్కి హాడ్గితే హాంగతుల్ బోధవడ్డాయ్

(అంత మందపాలుఁడు ప్రవేశము)

మంద :—క్యారేఽడ్డూఖాన్.

గి :—(నవ్వుచు) వహ్వా-వహ్వా-లాడూ గీడూ బా స్తీగా హాడ్డా తినిహలుంటావ్. హాందుచేత గిడ్డూఖాన్ హాండాన్కి బదులుగా లడ్డూ ఖాన్ హాంటున్నావ్ విశేషము లేవిఁటి?

మంద :—విశేషము లేమున్నవి? మన మహారాజుగారు నూతన వధువును వెంటఁ దుకొని రెండవ యిందుఁడివలె నగరప్రవేశ మొనరించుచున్నారు కీర్తిమంతునితోఁ దారవానివురంబున కేఁగినది నూతన వధూవరులు నగరులోఁ బ్రవేశించునరికి మంగళవాద్యములు మిన్నుముట్టునట్లు మ్రోగవలయు ననియుఁ బువ్వగుచ్ఛాలను సువ ర్ణాక్షతలను పురంధ్రీజనులు సౌధవీధుల నిలిచి వారిపైఁ జల్లవలె ననియు మంత్రులాజ్ఞాపించిరి మఱియుఁ బేదల కన్నవస్త్రములను, ఉద్యోగస్థులకు హెచ్చు వేతనములను పురోహితుల కగ్రహారములను భూసురులకు భూరినంభావలనుఁ సామంతులకుఁ గానుకలను. దక్కుం గలవారికిఁ దగినరీతుల బహూకరణములను అర్పింపవలయుననిరాజాజ్ఞ.

గి :—అచ్ఛా-అచ్ఛా. హెంతావంతోషం హాయితే, భాయీ నీకీ మాకీ హేమయిన, రాజుగార్కి పెంకిల్ గిండిల్ హాయినందుక్ లాభం గీభం హవుతుందా ? హవుండాదా ?

మంద :—ఓరి మూర్ఖుఁడా ! లేకేమి ? హెచ్చువేతనములని నేను మీకుఁ జెప్పలేదా ?

గి : —హాయితే మేం ఫారావాళ్ళంగదా ! మాకీ హుద్యోగ స్తుల్ లెక్కా-లోకి వస్తామా ?

మంద :—రాకేమిరా ? నీవుకూడ నుద్యోగస్థుఁడవే ! ఈ సోది కేమి ? రాజనగరులో నప్పుడే మంగళవాద్యములు మ్రోగుచున్నవి. మనముకూడఁ గన్నులార నా మహోత్సవము చూతము

(ఇరువురు నిష్క్రమింతురు, తెర పడును)

## అయిదవరంగము దర్బారు

(సింహాసనాసీనుఁడై కనకసేనుఁడు-మంత్రులు-సేనానులు పురోహితులు-పౌరులు మున్నగువారు యథోచితాసనములపై బ్రవేశము)

కనక :—సకలపురోహితామాత్య చమూపతులారా ! పౌరులారా ! నే డెంతయు సుదినము. వెనుక మా తండ్రిగారు మీ యందరి సమక్షమున సుఖాసీనులై యీ విధముగాఁ బ్రజానురంజకముగాఁ బరిపాలనము గావించిరి. అట్టిపుణ్యదినము నేఁడు మరలసంప్రాప్తమయినది.

మంత్రి :—పౌరులారా ! సామంతులారా ! కనకసేనమహారాజవర విక్రమ బలాఢ్యులుఁ గార్యసాధకుఁడు ప్రజ్ఞాధురంధరుఁడు ఉదయసేనమహారాజును దన సుగుణసంపత్తిచే మరపింపగల ధీరశాలి. ఈ మహాత్ముని యేలుబడిలో మీ రందరు నేకొరంతయు లేకుండ బ్రతుకుఁడు.

కనక :—మంత్రిసత్తమా !

సీ. పినతండ్రి ప్రజలను ♦ బీడించిలాగిన
ధనము, వారలకిచ్చి ♦ తనియఁజేసి ;
జీర్ణదేవళముల ♦ జెన్నొందఁ బునరుద్ధ
రణము గావించి య ♦ గ్రమ్ముఁబెట్టి

పేదసాదలు లేక ♦ పిచ్చి వెల్గొందంగ
వారి కుపాధు లే ♦ నారక మిచ్చి;
ప్రజల సంతోషమున్ ♦ వార్ధిఁ దేలాదు రీతి
పరిపాలనావిధం ♦ బరయఁబుసి

గీ. ధర్మపరిరక్షణంబును ♦ దనర జేసి
కనకసేనుఁడు పాలన ♦ కౌతుకంబు
కలుగఁజేసినదని యెల్ల ♦ జనులు మెచ్చ
జక్కఁజేయంగవలయును ♦ సత్వరమున.

పౌరులు :— జెయ్ శ్రీకనకసేనమహారాజుగారికి జెయ్

మంత్రి :— మహారాజా! మీ యాజ్ఞను నిర్వహింతుము.

కనక :— సచివులారా! కనుక మా పినతండ్రిచేత పీడింపబడిన వైశ్యుని బిలిపించుము వాని ధనమును వానికర్పింపుడు. వానిచే దగులఁబెట్టబడిన గ్రామములను దిరిగి నిర్మించుడు మఱియు ప్రజాసౌకర్యము ఁనదగిన నూతులు-చెరువులు-సత్రములు విశాలములగు బాటలు నిర్మించుడు. మన యేలుబడిలోఁ బ్రజలు తండ్రిగారిపాలనమరచి జార చోర క్షామబాధలు లేక నిత్య సత్యవ్రతులై, దానధర్మపరాయణులై, భక్తియుక్తులై సుఖింపవలయును.

పౌరులు :— మేలు మహారాజా! మేలు? నీ గుణగణంబులను కీర్తించుట కాదిశేషుఁడుగూడ సమర్థుఁడుగాడు.

కనక :— మంత్రులారా! నేఁటి దర్బారునకు హాజరయిన ప్రజలనెల్లర నుచితరీతిని సత్కరించి పంపుము ఇఁక సభఁ జాలించి మీరెల్ల ప్రయత్నంబులందుట నా యభిమతము.

మంత్రి :— పౌరులారా! మహారాజుగారును పట్టమహిషియుఁ బ్రాసాదోపరి భాగమునుండి కనుగొనుచుండగాఁ గోశాధిపతులు మీకు బహుమతుల నొసంగెదరు అందులకై ఇప్పుడు దర్బారు ముగియవలసినది మహారాజగారి యాజ్ఞ! (తెర వ్రాలును)



[illegible] ర్యము సంపూర్ణము.

# కీచకతారసాంగ్సు

1 ఉదయ—ఏగతి దుఃఖము నిపుడు పీడుచునో ॥ఏ॥
పుట్టినాఁడు దుష్టాత్ముఁడు నాసోదరుఁడు నాకర్మకతమునన్ ॥ఏ॥
(చరణము) పతితము పరవనితలఁ గోరి
దుష్టుల చెలిమిని మెలగుచుమండున్ ॥ఏ॥
పాపమునక కడు మోదమున మధువుఁగొని
అతిబీరలఁగని వేల్చుచున్ దొంగతనములకుఁ దలకొని
హత్యలు సలువుచుఁ భయముగొలుపుచుండున్
ఎపుడిక సాజన్యము దగఁ గల్గున్
మోదమందన్ సుఖయింపన్ ॥ఏ॥

2 మంత్రి— భూమిపాలా ! వగపూ ! స్వాంతమున వీడుమా
ఎంతబోధ సుధను నీ విచ్చిన నేమీ ॥భూ॥
(అనుపల్లవి) శీలముగ అపివన, ధర్మములెన్ని చెప్పినను, లాభము
సుంతయేని గలుగదుగ నీ-సోదరుండు మానడూ ॥భూ॥
(చరణము) కానలగాచు వెన్నెలట్లులా
పాములకును పాలొసగుఁరీతిని – గ్రుడ్డికి నద్దము చూపినగతి
వ్యర్థంబు నీ వాక్యములు వానికై
యేటికి మానసమందు చిగతిలెడు నీ తమ్ముడు క్రూరుడుగా.
ఏనాటికిన్ – మాటలా – లించునా ॥భూ

3. క్రూర—కలిగెనా– మూడెనుగా యికమృత్యువు నీ
యసువుల బలిమిని గొనుగద ॥కలిగెగా॥
(అనుపల్లవి) ననునిటు భయము రవంతయుగొనకే
గతి చులకదనంబున్ గనుదువా
(చరణము) తెలియునిక వడిగ మదీయ

గుణగణంబు, బలము, చలము. కనగునా
షలికెదుగా-చులకనగా-జడిసెద ॥కలిగెగా॥

4 భీమ:—రాజా! యిక తాళిదగదు-జేగిరింపుము ॥రాజా॥
(అనుపల్లవి) యోచింప కేదియో నొక శి
క్షనొసంగదగు వినుమిదు-సోదరుండనదగదు ॥రాజా॥
(చరణము) చోరుడౌచు దురంత మే చేసెగా
ప్రజాసముదయంబు మొఱవినుసుమా-సోదరుండీరీతినుండ
కీర్తియేనశియించును అల్లరి హెచ్చుక
వైశ్యనిదైన్యము తొలంగ జేసి-ధర్మరక్షణ నలుపబూని
సౌఖ్యకరము శాంతియు క్షేమము గాగనేలు భూమిని
రాజా! యింక తాళరాదు ॥రాజా॥

5. సేనాధిపతి:—శాంత ముపీడుమ-క్రూరుని నప్పుడె
కైదు పెయుదగు వీకన్ ॥శాంతము॥
ఖలుపిత మతియాట వాల దయఁ గనఁ
దగదు వినుమ భీతివీడి వేగ ॥శాంతము॥
(చరణము) బలము, చలము గన
బడ జవములు మెచ్చ-పదములు
కరములు కట్టెద క్రూరుని చెరనిడెదను;
అజ్ఞనొసంగుమ విమలచరితా, వినుతగుణా ॥శాంతము॥

౹. కమల—జాలమేలచేసెన్ విభుడు ॥జాల॥
క్రూరసేను దుష్టత్వంబున్ । స్వాంతమునఁ వలచి
విచారమొందెనో । మానసంబు వ్యాకులపడెనో
ఎంత సేపు తడయన్ ॥జాల॥

7. కమల—దుఃఖము పొందగా ॥దుఃఖము॥
విభుడ! కారణమేమినుడువు మలజడి కలిగెను మనంబున ॥దు॥
(చరణము) సోదరుడేయిటు వగలబొగల

దురితనికరములనునలిపి చింతగల్గజేసి
దుష్టమతిని మె । లంగుచుండెబోలు ॥దు॥
8. కనకసేనుడు—దునిమెనుగా । సచివరున్ బలుడగు
సైనికపతిని దురంతమే । గతిని అయ్యో పోపుగా
క్రూరుడే హత్యలం జేసెగా ॥దు॥
(చరణము) శిక్షనొనంగి యీ పాపిని జెఱను బెట్టి
ప్రజలను సాకుచున్న నిడుమన్ మూఁడుగా!
సోదరుండని కనికరమును ప్రకటింపకుమిక ॥దునిమెనుగా॥
9. కమల— క్రూరసేను డైలాగు.
కమల—నన్నంటఁబోకుమా ? దుష్టత్వముడుగుమా ॥నన్నలట॥
(అనుపల్లవి) వదినను । తల్లినంచు నెంచుమా
స్పృశియింపదగదు మానుమా ॥నన్నంట॥
పరవనితలఁ బొందగోర భావమొదల్
శాంతితూలు నరకమగునుగా ॥నన్నంట॥
క్రూర —విసరములేలా ? సరసమువలదా ? అరుదగు మాటలివేలా ?
అన్న యీగ్రాఁ ననుఁ గవిసి, సుఖముఁబొందు,
రాణిఁగాఁగ బ్రతుకుమా ॥విసరము॥
10. కనకసేనుఁడు, తార — డైలాగు.
కనక — జాలిలేక, యేలమమ్ముఁ జంపజూచెదూ ॥జాలి॥
తార—అయ్యో! యీ కఠినత్వమిదేలా!
తార—ఘంతమైన జాలిగల్గి, శిశువుల మము బ్రోవమా॥
తార — ఎందుదాగితివి సోదరా! నీ వెందుదాగితివి సోదరా॥
కృపమొదవ నన్ను విడియేగితే ?
అయ్యో! యీ కాననమున నను దయఁజూచెడి దిక్కెవ్వరీ? ।ఎం।
12. జారి, కమల—డైలాగు
కమల—నన్ను గదియఁబోకుమా ॥నన్ను॥
చావనుంటి విడువుమా! ఏల వ్యార్థినుండి తీయుట్టు
కోరెదవయ్యా ॥నన్ను॥

జాలారి—సక్కన్ని గుంటా ! సేరికూతుంటూ ! ఎందూకుతంటూ!
నన్నేలుగుంటా ||సక్కన్ని||
మంసేవ సెడ్డైసే కొత్తసాపులిత్తా ! నిన్నేలుకుంటానే||
నంవుతావె ! సరసమాడవే ! ||సక్కన్ని||

వల్లి—వల్లకురా ! సవతిని గట్టకురా ! ఇడుములు ! బెట్టకురా !
గండము జూపకురా ! ఓ బావా యిప్పు ! ఢొల్లకురా !
నాకుకూడా పెట్టలేవు ! బట్టనోసగజాలవు నీవు !
ఈమెను పెళ్లియాడన్ బోషింపన్ గడుకష్టము ||వల్లకురా||

పల్లిగాడు—సెప్పుతుంటేను యినవెంటిబోటి !
ఔతావు వల్లోళ్ళకీవు ||సెప్పు||
మోజుపుట్టంగ ముద్దిడుకోవె ! అద్దుమాటలాడ నీకేల !
నెత్తల్లు ! సేవలు రోజు తీసుకువత్త ! నెత్తిమీాదన !
కూకుడో ||సెప్పు||

కమల—అయ్యా ! నా మనవి వినగదయ్యా ! నన్నోరుట తగదయ్యా !అ!
జలములంబడి ప్రాణములను బాయంజూచినట్టి నన్ను పైకితీసి
తేలవయ్య ? అయ్యా||
తీసి యిట్లు కోరందగునె ? పరవనితను ! మరణమునకుం దల
కొనెదను ! ఒతుకన వినుపుపాపమె ||అయ్యా||

వల్లి—వీడుమురా ! ఆమెను విడువుమురా ! ఇదిగో నా దెబ్బ
యిక నీ యబ్బా ! వచ్చినదా సిగ్గు ! నీ వళ్ళు భగ్గు భగ్గుమని
విచ్చినది చూడు ! మనసిచ్చినది ! పుత్తిగట్టినది అగు నను
వీడకురా ! సవతిని గట్టకురా ! గండముం జూపకురా
ఓ పల్లీ ||విడువుమురా||

14. విజయ—ఆహా ! ఇంక తాళందగదు ఏగవొప్పుమ ||ఆహా||
(అనుపల్లవి) నా మిత్రుండు యుగ్రునిహా ! త్యానోనర్చునుగద!
వరసుగుణ వానిభార్యం గవియంగం గ్రూరుండు ||ఆహా||

(చరణము) క్రూరుఁడౌచు దుష్టింత మేచేసెగదా । సుధీనిధులెల్ల యమపురికంపెఁగా ॥ ఏను సైన్యసమేతుండనగుచు, బోయి । మిత్రరక్షణము గడంగ చేసి । ధర్మదీక్షఁ బూనవలయు ॥ఆహా॥ పాపయుతము న్యాయహారము పైన క్రూరసేను మట్టిని గలిపెద ॥ఆహా॥

15. తార—జాగేలా సుగుణాలవాల ఈ అడవి నే నెటుల వసింపం గలను ॥జాగేలా॥

పలువిధబాములఁ బరీక్షించెదవా । అనదసోనను । హే పరా త్పరా । కటకటా ! కష్టకష్టంబయ్యెన్ సోదరు జాడలఁ గాంచ నోచనా ।జాగేలా।

16. కనక—హే జగత్ప్రకాశా ? జగదాననా ! ఈశ్వరా !
ఆఆఆఆఆఆఆ ॥హే జగత్॥

సాయమొసఁగి । మముఁ జూడుముకరణ । పావనచరణా
సుగుణాభర— ఆఆఆఆఆఆ ॥హే జగత్॥
పసితనమున నిటు నిడుమలగుడువఁగ । దగదు నీకు వినుత చరిత । వరమౌనిగణనుత పదకమలయుగళ । వరదా ॥హే॥

17. కమల—సకల న్యాయవేత్తలారా ! సాధుభావశోభితాంతఃకరణ లార । ఓ దయాళులారా ॥సకల॥
ఆఆఆఆఆఆ ॥సకల॥
కలుషచిత్తుఁడు । క్రూరుఁడు నన్గవియఁజూచెఁగా । సాయము నాకీయొకఁ జేయరే ! వీని బారినుండిగా, పాడరే ! ధర్మరక్షణముఁ నకయి పూనరే ! మానము వీడరే ॥సకల॥

18. కనక సేన-క్రూరసేనుల-డైలాగ్.

కనక—గండుతోడ నఖండవిభయమ । భండనం । బున వెలయ నటుల గుండెల్ ఖండింతురా ! ॥గండు!

క్రూర—ఛీ ఛో !

కనక— గండుతోడ -

క్రూర—బలమెఱుఁగక నిటులరచెదవా | యమపురి కీక్షణ జనఁ
దలచెదవా?

కనక—ఔరా. ఎంవేగుదున్?

క్రూర—ఛీ! పో!

కనక—గండుతోడ

క్రూర—నీ తండ్రి | ధీమంతున్ మఱియెం | దఱినో పనిపితి కనవో
వినవో | పసితనంబునబలిమి | గదలింతును నసువులను ఛీ పో

కనక—చౌర్యంబిది కామా | జారత్వము కనదా | శౌర్యంబున నను
దాకుమ ఖలమతీ॥
[illegible] ఖండవిజయము | ఖండనం | బున వెలయునటుల
నీ గుండెల్ [illegible]తురా ॥ గండు॥ సంపూర్ణము.



## ప్రజానుకూలమైన స్టేజి డ్రామాలు

| | | | |
|---|---|---|---|
| అహల్య | [illegible] అ॥ | దీవార్ | అ॥ సూ॥ |
| [illegible]వణ | [illegible] వి॥ | మహారాజ్ శివాజీ | ,, |
| భ[illegible] | ,, | చరణదాసు | ,, |
| భక్తపోతన | ,, | తాన్ సేన్ | ,, |
| ప్రచండ భీమకవి | ,, | బాలనాగమ్మ | చే। వేం॥ |
| మీరాబాయి | మూ। సూ॥ | మళ్ళీపెళ్ళి | పె॥ పీ॥ |

ఒక్కొక్క ప్రతి రూపాయున్నర మాత్రమే

ఇందులో పాటలు విని తన్మయులౌతారు. పద్యాలు విని సమ్మోహితులౌతారు. మాటలువినియు ముగ్ధులౌతారు. ఆంధ్రహృదయాలను అద్భుత సన్నివేశాలతో ఆనందింపజేసే అమూల్యమైన యీ నాటకములు చదివి ఆనందించండి.

...మారావు అండ్ సన్సు
...ఆంధ్ర బుక్ డిపో, రాజమహేంద్రవరము.

Rajeswrs, Rly. E. G. No. 50 For No. 60 Cop 1000. 28-6-47.

